అట్ట లోపలివైపు అచ్చువేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లి అయిన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉన్న దృశ్యం. వారికి దిగువన వారి వ్యాఖ్యను రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖనకళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది. నాగార్జున కొండ, క్రీ. శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# తిరుమల రామచంద్ర

అక్కిరాజు రమాపతిరావు

సాహిత్య అకాదెమీ

*Tirumala Ramachandra* : A monograph in Telugu by Akkiraju Ramapatirao, Sahitya Akademi, (2006), Rs. 25



First Published : 2006

సాహిత్య అకాదెమీ

'రవీంద్ర భవన్', 35, ఫిరోజ్‌షా రోడ్. న్యూఢిల్లీ - 110 001.

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001.

జీవన్‌తారా భవనం, 4వ అంతస్తు, 23A/44X, డైమండ్ హార్బర్ రోడ్, కొల్‌కతా - 700 053.

443, గుణ బిల్డింగ్స్, తేనాంపేట, అన్నాసాలై, చెన్నై - 600 018.

సెంట్రల్ కాలేజ్ కేంపస్, డా. బి.ఆర్. అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 001.

172, ముంబయి మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, ముంబాయి - 400 014.

ISBN : 81-260-2327-9

వెల : రూ. 25

**Typesetting by R Graphic Design, Bangalore and Printed at ILA Mudrana, B'lore-26**

# పరిచయం

భారతీయ సాహిత్య నిర్మాతల ప్రచురణ శ్రేణిలో ఇప్పుడు తిరుమల రామచంద్రగారిపై మోనోగ్రాఫ్ (లఘు పరిచయగ్రంథం) వెలువడుతున్నది. స్వాతంత్ర్యానంతరం ఆధునిక భారతీయ భాషల ఉద్భవ వికాసాలను గురించి అన్ని భాషల వారు తెలుసుకొనేందుకు వీలు కలిగిస్తూ 'భారతీయ సాహిత్య నిర్మాతల'నే ప్రచురణ పరంపరలో ఆయా భాషలలో ప్రసిద్ధులైనవారూ, తరతరాలుగా తమ భాషా సాహిత్యాలను సంపన్నం చేసిన వారూ అయిన మహనీయులను గూర్చి ఆయా రచయితల జననకాల దేశ పరిస్థితులు, వారి సాహిత్య కృషి చరితార్థత, వారి ప్రతిభ తెలుసుకొనేందుకు స్థూల పరిచయ సాధనాలుగా ఈ ప్రచురణలు సహాయ పడతాయి.

సుమారుగా ఆధునిక భారతీయ భాషలన్నిటికీ గడచిన వెయ్యి సంవత్సరాల నుంచి ఐదు వందల సంవత్సరాల వరకు సాహితీ వికాస చరిత్ర ఉంది. ప్రతిభావంతులు, తమదైన ముద్రను ఆయా సాహిత్యరీతులలో ప్రస్ఫుటీకరించిన వారూ అయిన పూర్వకాల రచయితల నుంచి ఈ కాలపు వారి వరకు వారి ప్రత్యేకత ఏమిటో, వారి ప్రజ్ఞ, వారి సాహితీ సృజనశీలం ఏమిటో తక్కిన భాషల వారందరూ తెలుసుకోవటానికి ఈ రచనలు ఎంతగానో ఉపకరిస్తాయి.

అత్యంత ప్రాచీన సాహిత్య వారసత్వం, సంస్కృతి, జాతీయాదర్శం, మానవీయ ప్రగాఢ తాత్త్విక దర్శనమూ ఉన్న భారతీయ సాహిత్యం దేశం మొత్తంపై తన ప్రభావాన్ని ఏ విధంగా పదిల పరచుకొన్నదీ, ఏకాత్మ భావాన్ని ఎలా విస్తరించుకొన్నదీ, వైవిధ్యంలో ఈ ఏకతను ఎలా సంతరించుకున్నదీ కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకు, అస్సాం నుంచి ఆంధ్రప్రదేశ్ వరకూ భారతీయ సామాజిక వాస్తవికతలు, ఆదర్శాలు, సృజనశక్తులు, భావితాదాత్మ్యతలు ఏవిధంగా తరతరాలుగా గొప్ప రచయితలు ప్రతిబింబింప చేస్తూ

వచ్చారో ఈ ప్రచురణల ద్వారా భారతీయ సాహిత్య స్వరూప స్వభావాలు తెలుసుకోగోరే వారు, వారు దేశీయులైనా, విదేశీయులైనా ప్రయోజనం పొందగల అవకాశం ఇందువల్ల సమకూడింది.

తిరుమల రామచంద్ర 20వ శతాబ్ది తెలుగుసాహితీపరులలో గొప్ప విద్వాంసులు, ప్రాచీనాధునిక సాంస్కృతిక సాహిత్య సంప్రదాయరీతులను బాగా ఆకళించుకున్నవారు. అనేక భాషల పరిచయం ఉన్నవారు. సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శ, సాహిత్య పరమార్థ వివేచనం తమ రచనల ద్వారా సమీక్షించిన ఉత్తమ సాహిత్యవ్రతులు.

గ్రంథ రూపంలో వచ్చిన వారి రచనలు 50 దాకానూ, వివిధ పత్రికలలో వెలువరించిన వ్యాసాలు, సమీక్షలు సుమారు వెయ్యికి మించిన్నీ వారివి ఉన్నాయి. అర్ధశతాబ్ది కాలం ఆధునిక తెలుగు సాహిత్య లోకానికి ఆయన చిరపరిచితుడు. ఇప్పుడు పదిహేను చిన్న ప్రకరణాలలో ఆయన సాహిత్య 'కృషి' ఏమిటో ఈ చిన్న గ్రంథంద్వారా తెలుసుకోవచ్చు.

— అక్కిరాజు రమాపతిరావు

నం. 2-2-18/47, బి-20,
ఫ్లాట్ 104, శ్రీ సాయి కృపా రెసిడెన్సీ,
హైదరాబాదు - 500 013.

# ప్రకరణ క్రమం



## అనుబంధం

# 1. 20వ శతాబ్ది తెలుగు సమాజం - సాహిత్యం

ఆధునిక ప్రపంచ చరిత్రలో ఇరవయ్యో శతాబ్దానికి ఎంతో ప్రాముఖ్య మున్నది. సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మత, నవీన సిద్ధాంతావిష్కరణలు, జాతుల విముక్తి సంఘర్షణలు, స్వాతంత్ర్యోద్యమాలు ప్రపంచవ్యాప్తంగా సంభవించాయి. రెండు ప్రపంచ యుద్ధాలు భారతదేశాన్ని ప్రభావితం చేశాయి. భారతదేశానికి సుమారు రెండు శతాబ్దాల విదేశీ పరిపాలన నుంచి స్వాతంత్ర్యం లభించింది. ప్రపంచ దేశాల మధ్య సామాజికావగాహన విస్తరించింది. కొత్త దేశాలు రూపొందాయి. శాస్త్రీయ విజ్ఞానం త్వరితగతిని వృద్ధి చెందడం వల్ల, సాంకేతిక పరిజ్ఞాన సహాయం వల్ల వార్తా ప్రసారం, దేశదేశాల మధ్య ప్రయాణ సౌకర్యాలు అభివృద్ధి చెందాయి.

ఇక సాహిత్య స్వరూప స్వభావాలు బహువేగంగా మానవానుభవ విశాలోదార పరిధులలో విస్తరించాయి. అనంతమైన వైవిధ్యం ప్రపంచ సాహిత్యంలో చోటు చేసుకుంది. ఈ ప్రభావం అంతో ఇంతో భారతదేశం పై కూడా ప్రసరించింది. ప్రభావం చూపింది. ఆధునిక భారతీయ భాషా సాహిత్యాలలో అత్యపూర్వమైన ప్రక్రియా వైవిధ్యం బయలుదేరింది. వస్తు శిల్ప విన్యాసరీతులలో నవీనాభివ్యక్తి సమాదృతమైంది. సంప్రదాయం ఉదారతకు చోటిచ్చింది. మానవ జీవితానుభవగవేషణలో లలిత కళలు పరస్పర ప్రభావశీలమైనాయి.

తెలుగు సాహిత్య విషయానికి వస్తే సుమారు అంతకుపూర్వం వెయ్యేళ్ల సాహిత్యానికీ 20వ శతాబ్దిలో వెలువడిన సాహిత్యానికీ ఎంతో వైవిధ్యంతో కూడిన అంతరం కనపడుతుంది. కారణాలు ఏవైనా పూర్వపు వెయ్యి సంవత్సరాల సాహిత్య చరిత్రలో వెయ్యి మందిని అయినా రచయితలను లెక్కించలేము. ఒక్క ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలోనే వెయ్యి మంది రచయితలు లెక్క తేలుతారు. పత్రికలలో వచ్చినవీ, పుస్తక రూపంలో సంకలితం కానివీ, పుస్తక రూపంలో వచ్చినవీ కలుపుకుంటే ఒక లక్ష పైగా రచనలు 20 శతాబ్దంలో లెక్కకు వస్తాయి. అంతకుముందటి శతాబ్దంలో అచ్చైన తెలుగు పుస్తకాలను నూటికిపైగా లెక్కించలేము. ఇక రచయితలను నూరు మందిని పేర్కొనడం కూడా కష్టమే.

సుమారు ఎనిమిది శతాబ్దాలలో తెలుగులో పదికి మించి కూడా వివిధ

ప్రక్రియలు కనపడవు. పూర్తి వచన రచనలు కొన్ని పదులలోనైనా లెక్కకు రావు. 20వ శతాబ్దంలో వచన రచనలు తెలుగులో అంతకుముందు వచ్చిన వాటికన్నా వెయ్యింతలు ఎక్కువగా ఉన్నాయి. 20వ శతాబ్ది తెలుగు రచయితలను దశాబ్దానికి సగటున నూరుమందిని లెక్కించినా ఈ సంఖ్య వెయ్యి దాకా విస్తరించవచ్చు. ఇదీ 20వ శతాబ్ది తెలుగు సాహిత్యం వైవిధ్యం. వైపుల్యం. ఆధునికవిజ్ఞాన శాస్త్రం విద్యుత్తును ఉత్పాదనం చేసి వినియోగంలోకి తెచ్చిన తర్వాత వివిధ దేశ పారిశ్రామిక విజ్ఞానం, మానవ జీవన సౌకర్య ప్రమాణాలను అన్ని రంగాలలోనూ వృద్ధి చేసినట్లు, అచ్చు యంత్రాలు వచ్చిన తరువాత అక్షర విజ్ఞానం నూరింతలుగా, వెయ్యింతలుగా వృద్ధి చెందింది. వార్తా పత్రికల ద్వారా దేశదేశాలు దగ్గరైనాయి.

తెలుగునాట 20వ శతాబ్ది మొదటి దశకానికే దిన పత్రికలు, వార పత్రికలు ప్రారంభమైనాయి. ఈ శతాబ్ది మొదటి దశాబ్దిలో అవి ఎక్కువలో ఎక్కువ 10 దాకా ఉంటే చివరి దశాబ్దానికి అవి నూటిని మించాయి. కథ, నాటకం, నాటిక, నవల, నవలిక, ప్రహసనం, కవితా ఖండిక, సాహిత్య విమర్శ, సాహిత్య చరిత్ర, కవుల చరిత్ర వంటి ఎన్నో కొత్త ప్రక్రియలు బయలుదేరాయి. సమాదృతమైనాయి. చరిత్ర పరిశోధన, శాసన పరిశోధన, పురాచరిత్ర శోధన, సమాజశాస్త్రం, మానవశాస్త్రం, భాషల పుట్టుపూర్వోత్తరాలను తెలిపే భాషాశాస్త్రం వంటి వాటిని గూర్చి పరిశోధక కృషి ప్రారంభమైంది.

సమాజ మేధావులలో, సాహిత్యవేత్తలలో పుస్తక ప్రచురణ పట్ల ఆసక్తి అధికమైంది. బహుశా ఈ విధమైన నూతన చైతన్యం, కొత్త ఆసక్తి కలగడానికి ఇంగ్లీషు చదువులు చాల వరకు కారణం కావచ్చు. అనూచానంగా వస్తున్న జీవన విధానాలను అంటిపెట్టుకుని ఉండటం వల్ల వెనుకటి కాలంలో వలె సాఫీగా జీవయాత్ర సాగే అవకాశాలు అనేక సామాజిక వర్గాలలో మృగ్యమైనాయి. పారిశ్రామిక నాగరకతతో కులవృత్తులు పోటీపడలేక పోయినాయి. ప్రయాణ సౌకర్యాలు, వివిధ సరకుల రవాణా సౌకర్యాలు ఎక్కువ కావడంతో, ఉద్యోగావకాశాలు ఏర్పడడంతో సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థలోనే పెనుమార్పులు చోటు చేసుకున్నాయి.

భారతదేశంలో ఇంగ్లీషు పట్ల మోజు, ఆసక్తి క్రమంగా ఎక్కువవుతూ వచ్చాయి. దాని వల్ల ప్రయోజనమూ, లాభమూ కూడా విద్యాసక్తి కల వర్గాలలో సద్యః ఫలితంగా సమకూడుతూ వచ్చాయి. న్యాయసభలూ, చట్టాలు కొత్తగా ప్రవేశించాయి. పరిపాలన శాఖలు రూపుదిద్దుకున్నాయి. విద్యారంగంలోనూ వ్యవస్థాత్మకమైన మార్పులు, ఉద్యోగాలు నెలకొన్నాయి. 20వ శతాబ్ది ప్రారంభానికే రెండు తరాల కొత్త విద్యాధిక వర్గాలు అప్పట్లో ఇంగ్లీషు మాధ్యమ విశ్వవిద్యాలయాల చదువుల ద్వారా సమాజ వ్యవస్థా చింతనకు పూనుకున్నాయి. నూతన మత

సాంస్కృతిక వ్యవస్థాత్మక పరిణామాలు, ధోరణులు కూడా ఆలోచనాపరులను ప్రేరేపించాయి. ఈ పరిస్థితులన్నీ భారతదేశంలో స్వాతంత్ర్య సముపార్జన ఉద్యమానికి నేపథ్యంగా ఇరవయ్యో శతాబ్ది తొలి దశకానికే నెలకొన్నాయి.

జాతిని చైతన్యవంతం చేయగల మహాపురుషులు అన్ని రంగాలలోనూ కాలిక అవసరాలకు అనుగుణంగా అప్పటికే ప్రభవించి తమ కృషిని వ్యవస్థీకరించగలిగారు. పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధం నుంచే తెలుగు పుస్తకాలు అచ్చు కావడం ప్రారంభమైంది. ఇంగ్లీషు - తెలుగు, తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులు కూడా ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అనే తెలుగు సాహిత్యాభిమాని, తూర్పిండియా కంపెని పరిపాలనోద్యోగి ప్రకటించాడు. ఆయన అప్పటి వరకు తాటాకు ప్రతులుగా ఉన్న తెలుగు కావ్యాలను, ప్రబంధాలను, పండితుల సాయంతో సేకరించి పరిష్కరింప చేశాడు. వేమన పద్యాలను ఇంగ్లీషులోకి అనువదించి ప్రకటించాడు. భారత, భాగవతాలు, మనుచరిత్ర, వసుచరిత్ర వంటి ప్రబంధాలు, పలనాటి వీరచరిత్ర వంటి దేశీయ వీరగాథలు, జంగంకథల వంటివి కూడా ఎంతో ఆసక్తితో బ్రౌన్ దొర సేకరింపచేసి, వాటికి ప్రత్యంతరాలు కూడా సంపాదింపజేసి గ్రంథ పరిష్కరణంలో తెలుగు పండితులకు మార్గదర్శకుడైనాడు. అందువల్ల తెలుగునాట ప్రాచీన కావ్య ప్రకటనం పట్ల కవి పండితులలో ఆసక్తి ఎక్కువైంది. తరతరాలుగా కాపాడుకుంటూ వచ్చిన, తమ దగ్గర భద్రంగా ఉన్న తాళపత్ర గ్రంథాలను పుస్తక రూపంలో అచ్చువేయడానికి పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రతి కవి, పండితుడు ఎంతో ఉత్సుకత కనపరచారు. కేవలం ప్రాచీన కావ్యాల ప్రకటనం కోసమే ప్రతి పండితుడూ ఒక పత్రిక నిర్వహించి ఆ పత్రికలో తమ దగ్గర ఉన్న అపూర్వ రచనలను భాగభాగాలుగా ప్రచురించేవారు.

కొక్కొండ వేంకటరత్నం, కందుకూరి వీరేశలింగం, వేదం వెంకట్రాయ శాస్త్రి వంటి గొప్ప సాహిత్యవేత్తలు పత్రికా ప్రచురణ ప్రారంభించి పాత కావ్యాలు, ప్రబంధాలు అచ్చువేశారు. వీరంతా తమ తమ సొంత ముద్రణాలయాలు నిర్వహించటం విశేషం. కేవలం పద్యకావ్యాలు, ప్రబంధాలు మాత్రమే కాక, సంస్కృత నాటకాల అనువాదాలు, ఇంగ్లీషు నాటకాల అనువాదాలు, పాఠశాలల్లో పాఠ్యపుస్తకాలుగా పనికివచ్చే రచనలను ప్రకటించనారంభించారు. ఈ విధంగా సాహిత్య రచనలలో ఎంతో వస్తు వైవిధ్యం విస్తరించడానికి ఆస్కారం కలిగింది. పత్రికలు ప్రారంభమైనందు వల్ల సాహిత్య విమర్శ పట్ల కూడా పండితుల దృష్టి మళ్లింది. వ్యాస రచన ఆవశ్యకత పెరిగింది. గ్రంథ ప్రచురణ సందర్భంగా కవికాలం, దేశం, ప్రతిభ మొదలైన విషయాలు తెలియచేసే సందర్భంగా చరిత్ర పరిశోధన, సాహిత్య పరిశోధన ప్రారంభమైనాయి.

సంస్థానాధిపతుల, జమీందారుల, కవిపండితుల పరిపోషకత్వం నుంచి

సాహిత్యం విస్తృతవర్గాలకు, సామాన్య విద్యావంతులకు క్రమంగా చేరువవుతూ వచ్చింది. ప్రజలు విద్యావంతులు కావడానికీ, లోకవృత్తం తెలుసుకోవడానికీ ఇతివృత్త వైవిధ్యం గల రచనలు అవసరమని కవులు, సామాన్య రచయితలు, సమాజ మేధావులు కూడా గ్రహించారు.

అందువల్లనే 20వ శతాబ్ది మొదటి దశకానికే మారేపల్లి రామచంద్రశాస్త్రి కొమర్రాజు వేంకటలక్ష్మణరావు వంటి సాహిత్య పరులు గ్రంథ ప్రచురణ సంస్థలను ప్రారంభించారు. తమ ప్రచురణలలో వచన రచనలకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. కొమర్రాజువారు దేశచరిత్ర, మహాపురుషుల జీవిత చరిత్రలు. శాస్త్రవిజ్ఞానం, చారిత్రక నవలలకు తమ విజ్ఞాన చంద్రికా మండలి ప్రచురణలలో ప్రోత్సాహం కలగచేశారు. విజ్ఞాన సర్వస్వ ప్రచురణ వంటి మహత్ప్రయత్నాల ద్వారా మాత్రమే భాష సుసంపన్నం కాగలదని, సాహిత్యం ఆధునికత సంతరించుకోగలదనీ శ్రీ లక్ష్మణరావు ఎంతో ముందుచూపుతో తెలుగు వారిని పుస్తక పఠనం పట్ల ఎంతో చైతన్యవంతులను చేశారు. అప్పట్లోనే విజ్ఞాన చంద్రికా మండలి ప్రచురణలు పాఠకులలో ఆసక్తిని కలిగించి వేలమంది చందాదారులు ఆ ప్రచురణల నభిమానించారు. లక్ష్మణరావుగారు రచించిన హిందూదేశ కథా సంగ్రహమనే హిందూ మహాయుగం ప్రతి సంవత్సరం ఒక నూత్న ముద్రణ వెలువడటం ఇందుకు తార్కాణం. 1907లో మొదటిసారి వెలువడిన తర్వాత ఈ గ్రంథం ప్రతి సంవత్సరం ఒక కొత్తముద్రణగా 5 సంవత్సరాలు వెలువడింది.

1902లోనే మచిలీపట్నం నుంచి కృష్ణా పత్రిక, 1908-09లలో బొంబాయి నుంచీ, తర్వాత చెన్నపట్నం నుంచీ ఆంధ్ర పత్రిక వార పత్రిక, దిన పత్రికలు ప్రారంభం కావడం, 1910 నుంచి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు రావడం తెలుగు వారి సామాజిక ప్రగతికి, సాహిత్యోత్తేజానికి ఎంతో దోహదం చేశాయి. ఆంధ్రపత్రిక కన్నా ముందే గుంటూరు నుంచి దేశాభిమాని, రాజమండ్రి నుంచి గౌతమి, దినపత్రికలు కొంతకాలమే వచ్చినా తెలుగు వారికి దినపత్రికలు ఎందుకో ఆ అవగాహన కలగజేశాయి. ఇందువల్ల పత్రికానిర్వహణ కూడా ఒక వృత్తిగా, పత్రికా రచన కూడా ఒక ప్రక్రియగా తెలుగు వారికి తెలియవచ్చాయి.

1920లలో సాహితి, 1922 శారద, 1924లో భారతి పూర్తిగా సాహిత్య పత్రికలుగా వెలువడడం మొదలుకావడంతో ఆధునిక తెలుగు సాహిత్యంలో గొప్ప ప్రక్రియావైవిధ్యం రూపుదిద్దుకొంది. ఈ పత్రికలు మొదలయ్యే నాటికే 1919వ సంవత్సరంలోనే 'తెలుగు' అనే పత్రికను ఆనాటి గంజాం జిల్లాలోని పర్లాకిమిడి నుంచి గిడుగు రామమూర్తి పంతులు ప్రారంభించాడు. ఈ పత్రిక ఒక సంవత్సరం మాత్రమే వచ్చినా ఆధునిక తెలుగు భాషా సాహిత్య వికాసంలో ఒక గొప్ప చారిత్రక సంఘటనగా దీనిని స్మరించుకోవాలి. ఇటువంటి పత్రిక ఆ కాలానికి ఏ

ఆధునిక భారతీయ భాషలలోనూ వచ్చి ఉండే అవకాశం లేదు. 20వ శతాబ్ది భారతీయ భాషా శాస్త్రవేత్తలలో గిడుగు వారు ప్రముఖులు. అంతర్జాతీయమైన గుర్తింపు పొందిన వారు. వ్యావహారిక భాషోద్యమాన్ని నిర్వహించి తెలుగు వారి సర్వతోముఖ సత్వర విజ్ఞాన వర్ధనం కోసం శ్రమించిన మహాపురుషుడాయన. తెలుగు అత్యంతాధునిక భాషగా రూపొందటానికి ఆయన ఎన్నో ప్రణాళికలు రచించి తెలుగుపత్రిక ద్వారా ప్రచారం చేశారు. సృజనాత్మకమైన అభివ్యక్తికి వాడుక భాషే ఉపాదేయమని పండితులతో అంగీకరింపజేసిన గొప్ప ప్రతిభాశాలి రామమూర్తి పంతులు.

తెలుగునాట 1910 నుంచి 1920 వరకు వ్యావహారిక భాషోద్యమం గొప్ప సంచలనాన్ని కలిగించింది. గిడుగు వారి వాదాన్ని ఎదుర్కోవడానికి సంప్రదాయాభినివేశపరులు 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు'ను 1912 నాటికే స్థాపించి ఆ తర్వాత సాహిత్య పరిషత్పత్రికను కొన్ని దశాబ్దాల పాటు నిర్వహించారు. ఇందు వల్ల కావ్య భాషాధ్యయనం, వ్యాకరణ ప్రయోజనం, భాషా తత్త్వపరిశోధనలలో పండితులు గాఢపరిశ్రమ చేయగల అవసరమూ, అవకాశమూ కూడా ఏర్పడ్డాయి.

తిరుమల రామచంద్ర 1913లో జన్మించారు. ఆయన 20వ శతాబ్ది తెలుగు సాహిత్య రంగంలో గొప్ప పత్రికా రచయితగా, వ్యాసరచయితగా, పరిశోధకుడుగా, ముందు తరాల వారికి స్మరణీయులవుతారు. ఆరుదశాబ్దాల కాలం ఆయన పత్రికా రంగానికే అంకితమైనారు. తెలుగునాట గొప్ప పత్రికా రచయితలుగా, సంపాదకులుగా ప్రసిద్ధులైన వారందరితోనూ రామచంద్ర కలిసి పనిచేశారు. 20వ శతాబ్దిలో రామచంద్ర గారి వలె ఇంత దీర్ఘకాలం పత్రికా రచయితగా జీవితం గడిపిన వారు మరొకరు లేరు. పత్రికలలో ఆయన చేసినన్ని రచనలు చేసిన వారూ మరొకరు లేరు. ఆయన స్వయంగా 'పరిశోధన' అనే పత్రికను కూడా నిర్వహించారు. తన సమకాలికులైన కవిపండిత ప్రముఖులందరితోనూ, కళాకారులందరితోనూ రామచంద్ర హార్దికమైన పరిచయమూ, కొందరితో సాన్నిహిత్యమూ నిలుపుకున్నారు. ఐదారు పత్రికలలో మొత్తం ఏభై-అరవై సంవత్సరాలు పనిచేయడమే కాక సుప్రసిద్ధులైన ఏభై-అరవై మంది తెలుగు రచయితల గౌరవాదరాభిమానాలు, మెప్పు పొందారు. పురాచరిత్ర, సమాజ శాస్త్రం, భాషా సాహిత్యాలు, దేవాలయ శిల్పరీతులు, సంగీతం, లలితకళలు, ఆయన విశిష్టంగా అధ్యయనం చేశారు. సామాన్య పాఠకుడికి కూడా ఆసక్తి కలిగేట్లు ప్రతి రచనలో ఆయన ప్రతిభాముద్ర కనపడుతుంది.

ఒక ఆధునిక అభ్యుదయ కవి తనను తాను 'వ్యాస సంతతి' వాడుగా అభివర్ణించుకున్నాడు. కాని ఈ భావన రామచంద్రకు నూటికి నూరుపాళ్లూ అన్వర్థం.

---

# 2. కుటుంబ జీవన నేపథ్యం

వెనకటి కాలంలో ఇప్పటి కాలంలోలాగా మానవ వ్యాపృతులలో చలన శీలత ఎక్కువగా ఉండేదికాదు. ఇప్పుడైతే సముద్రాలు దాటి, ఖండాలు దాటి, ఖండాంతరాలకు చేరుకుంటున్నారు. డబ్బు ఉండాలే కాని ప్రయాణ సౌకర్యాలున్నాయి.

డెబ్భై ఏళ్ల కిందట మద్రాసు నుంచి లాహోర్‌కు రైలు ప్రయాణం నాలుగు రోజులు పట్టేదని తిరుమల రామచంద్ర స్వీయచరిత్రలో రాసుకున్నారు. అంతకు పూర్వం మరి డెబ్బై ఏళ్ల కిందట ఒంగోలు నుంచి రాజమహేంద్రవరం చేరటానికి అంచెబండ్ల ద్వారా, కాలవల మీద, పడవల ద్వారా పదిరోజుల పైన పట్టేదని ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు గారు స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. గుంటూరు నుంచి బందరుకు ఒకరోజు ప్రయాణమని కొండ వెంకటప్పయ్య గారి కథనం. కోస్తా జిల్లాల వాళ్ల మద్రాసు వెళ్లాలంటే పందొమ్మిదో శతాబ్ది చివరిదశకం వరకూ కూడా కాకినాడ వెళ్లి స్టీమరెక్కి (స్టీమరు దాకా చిన్న బోటు మీద వెళ్లి స్టీమరులోకి చేరాలి) ఏ రెండ్రోజులో మూడురోజులో ప్రయాణం చేయవలసి వచ్చేది. భోగరాజు పట్టాభి సీతారామయ్య, అజ్జాడాదిభట్ల నారాయణదాసు, రాయసం వెంకటశివుడు, కందుకూరి వీరేశలింగం అంతా నూరేళ్ల కిందట ఈ విషయాలు రాశారు.

ఇందువల్ల మనుషులు దూరదేశాలకు తరచు ప్రయాణం చేసే వారు కాదా ! అంటే అదేమీ కాదు. విశాలమైన రాజ్యాలు స్థాపించేవారు. వేలమైళ్లు వెళ్లేవాళ్లు. ఖండాంతరాలతో వర్తకం, వ్యాపారం వాణిజ్యాలు కొనసాగించేవాళ్లు. అదంతా గత చరిత్ర. అయితే ఈ విధంగా వలసలు సాగించడానికి ప్రోత్సాహమో, అవసరమో ఉన్నప్పుడే కొన్ని వంశాల వారు, కొన్ని కుటుంబాల వారు దూరప్రాంతాలకు వెళ్లి అక్కడ జీవిక సంపాదించి స్థిరంగా కుదురుకునేవారు. అక్కడి ప్రజలలో కలిసి పోయే వారు.

రాజులు పరరాజ్యాలను జయించినప్పుడు ఆయన వెంట ఆయన రక్షణోద్యోగ కుటుంబాలు, పురోహితవర్గం, కవి పండితులు, కళాకారులు ఆ కొత్త రాజ్యాలకు వెళ్లేవాళ్లు. ఆ రాజులు గతించినా క్రమంగా ఆ రాజ్యాలు లేకుండా పోయినా ఒకప్పుడు ఇతర ప్రాంతాల నుంచి చేరిన కుటుంబాలు అక్కడే ఉండిపోయేవి.

వెయ్యేళ్లనాడు భగవద్రామానుజులు దక్షిణ దేశంలో శ్రీ వైష్ణవభక్తి ఉద్యమం ప్రారంభించాడు. సమాజంలో గొప్ప ప్రభావం తెచ్చాడాయన. భక్తి వల్ల సమాజంలో సంపన్న దారిద్ర్య భేదాలు, కుల మత విపక్షలు తొలగిపోతాయనీ, భగవత్సేవలో అందరూ ఏకమవుతారని శ్రీమద్రామానుజులు శ్రీవైష్ణవమత సిద్ధాంతాన్ని వ్యవస్థీకరించాడు. అప్పుడు తెలుగు నాట కూడా ఆయన తన భక్తి మత వ్యాపన కేంద్ర పీఠాలను స్థాపించాడు. వైష్ణవారాధన, వైష్ణవ దేవాలయాల విస్తరణ అప్పట్లో పెద్ద ఎత్తున కొనసాగాయి. వైష్ణవ దేవాలయాలలో ఆరాధన విధానాలను క్రమబద్ధీకరించాడాయన. శ్రీ వైష్ణవ భక్తి సిద్ధాంతంలో మహాభక్తులుగా పరిగణితులైన పన్నిద్దరాళ్వారుల భగవన్మహిమ స్తోత్రాలను వైష్ణవాలయాలలో పారాయణం చేసే సంప్రదాయాన్ని ఆయన నెలకొలిపాడు. ఈ స్తోత్రాలను తమిళులు దివ్య ప్రబంధమనీ, ద్రావిడవేదమనీ అంటారు. వీటిని పాశురాలని కూడా సంభావిస్తారు. వైష్ణవ దేవాలయాలన్నిటా ఆళ్వారుల అర్చా మూర్తులుంటాయి. దివ్య ప్రబంధ పారాయణం ఉంటుంది. ఆయా ఆళ్వారుల తిరునక్షత్రాలు అంటే జన్మదిన దివ్యోత్సవాలు కూడా జరుపుతారు. ఈ దివ్య ప్రబంధాలు అరవ భాషలోనే ఉంటాయి కాబట్టి వైష్ణవ దేవాలయ అర్చకులకు అరవం తెలిసి ఉండాలి. బదరీ నారాయణం నుంచి ఈ దివ్య ప్రబంధ అధ్యయనం కోసం క్షీరాబ్ధినాథశర్మ అనే బదరీనాథ ఆలయ పూజారికుటుంబ యువకుడు తిరుపతి సంస్కృత కళాశాలకు వచ్చి అత్యంత శ్రద్ధాభక్తులతో, ఆసక్తితో అధ్యయనం చేసినట్లూ, ఆయన తన సహాధ్యాయి వర్గంలోని వాడైనట్లూ తిరుమల రామచంద్ర స్వీయచరిత్రలో ప్రస్తావించారు.

ఈ విధంగా కొన్ని శతాబ్దాల కిందట తమిళదేశం నుంచి శ్రీ వైష్ణవ దేవాలయాలలో అర్చాదికాలు నిర్వహించటానికి, ఆగమశాస్త్ర సంప్రదాయాలు బాగా తెలిసిన కుటుంబాలు తెలుగు ప్రాంతాలకు వలస వచ్చాయి. ఇటువంటి కుటుంబాలలో ఒకటి తిరుమల రామచంద్రగారి పూర్వికుల కుటుంబం. వీరికి తిరుమల వారని ఇంటి పేరు రావడానికీ, అది స్థిరపడటానికీ మూలకారణమైన ఉదంతం ఒకదానిని శ్రీరామచంద్రే స్వీయచరిత్రలో ప్రస్తావించారు. శ్రీశైలపూర్ణులనే మహానుభావుడు, పరమ వైష్ణవాగ్రణి, తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నిత్యకైంకర్యాలు నిర్వహిస్తుండేవారుట. వీరిని తిరుమలనంబి అని లోకం వ్యవహరించేదట. భగవద్రామానుజులు వీరి మేనల్లుడే అనీ, శ్రీ రామానుజుల వారు మేనమామ దగ్గరే కొంతకాలం ఉండి వారిని శుశ్రూషించి చదువుకున్నారనీ తిరుపతి నుంచి కొండ ఎక్కి ప్రతిరోజూ తిరుమల వెళ్లి స్వామివారి కైంకర్యం నిర్వహించే శ్రీశైలపూర్ణులు మేనల్లుడికి దారిలో పాఠాలు చెపుతుండే వారనీ ఐతిహ్యం. ఈ తిరుమలనంబి పేరు మీదుగానే తిరుమల వారి ఇంటి పేరు ఏర్పడిందని శ్రీరామచంద్ర వక్కణం.

విజయనగర రాజుల కాలంలో శ్రీవైష్ణవం గొప్ప రాజాదరణ పొందింది. శ్రీ కృష్ణదేవరాయలు కూడా గొప్ప వైష్ణవ మతాభిమాని అయినట్లు ఆ మహారాజు రచించిన గోదాదేవి కల్యాణ గాథ సాక్ష్యం పలుకుతున్నది. వీరికి తాతాచార్యుల వారు మతాచార్యులని కూడా తెలుగునాట ఎన్నో కథలున్నాయి. తిరుమల వారి వంశంలో తాతాచార్యులనే వారు మహావిద్వాంసులుగా మహారాజప్రాపకాన్ని పొందిన మహామనీషిగా విఖ్యాతులు కావడం వల్ల ఆ తర్వాత తర్వాత తరాల వాళ్ళ కూడా ఆ ఘనతను తమకొక బిరుదుగా, గౌరవంగా, హోదాగా భావిస్తూ తాతాచార్యుల వారి పేరు తమ పేరుకు కలుపుకునేవారని కూడా రామచంద్ర ప్రస్తావించారు. ఈవిధంగా రామచంద్ర గారి ముత్తాత గారి పేరు వరకూ, రామచంద్ర పిన తండ్రివరకూ తాతాచార్య బిరుదు కనపడుతుంది. రామచంద్రగారి ముత్తాతగారి పేరు శ్రీ రామస్వామి తాతాచార్యులు. ఈ కుటుంబం వారు కాంచీపురం నుంచో లేదా దక్షిణాదిన సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలైన శ్రీరంగం నుంచో, శ్రీవిల్లిపుత్తూరు నుంచో విజయనగర సంస్థానం చేరి ఉండవచ్చు.

విజయనగర రాజ్యం పతనం కావడంతో అప్పట్లో అనంతపురం దగ్గరలోని తాడిమర్రి అనే బోయరాజుల సంస్థానం వారు తిరుమల వంశీకులను ఆచార్యులుగా గౌరవించి తమ ఆస్థానంలో నిలుపుకున్నారు. అప్పటి నుంచి వీరు తిరుమలతోపాటు తాడిమర్రిని కూడా కలుపుకొని తమ ఇంటిపేరుగా వ్యవహరించేవారు. ఈ వైనం రామచంద్ర గారి ముత్తాత కాలం వరకూ కొనసాగుతూ వచ్చింది. ప్రథమ స్వాతంత్ర్యోద్యమ కాలానికి ముందే తాడిమర్రి బోయ సంస్థానం బ్రిటిషు వారిపై తిరగబడి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నది. కాని బ్రిటిషు వారి సైనిక బలం ముందు నిలవలేక విచ్ఛిన్నమైపోయింది. అప్పుడు తిరుమల తాడిమర్రి కుటుంబాల వాళ్లు బళ్లారి జిల్లాలోని కమలాపురానికి వలస పోయినారు. దీనికి బలమైన కారణం ఒకటి ఉంది. రామచంద్రగారి ముత్తాత గారైన రామస్వామితాతాచార్యుల వారి అత్తవారి ఊరు కమలాపురం. అక్కడి 'ప్రబంధం' వారనే శ్రీవైష్ణవ కుటుంబం వారు ఆయనకు పిల్లనిచ్చారు, రామస్వామితాతాచార్యుల వారు 1857 ముందుగానే కమలాపురం చేరి ఉంటారు.

కమలాపురంలో ప్రబంధం కుటుంబాల వారు అక్కడి కోదండ రామస్వామి, కృష్ణస్వామి, పట్టాభి రామస్వామి దేవాలయాలలో అర్చకత్వం నిర్వహిస్తూ దివ్య ప్రబంధ పారాయణతత్పరులు కావడం వల్ల వారికా ఇంటిపేరు వచ్చి ఉంటుందని రామచంద్రగారి కథనం. వీరు తంజావూరు నుంచో, కుంభకోణం ప్రాంతాల నుంచో విజయనగరం చేరినట్టుగా కూడా రామచంద్ర చెపుతున్నారు.

ఇక తాడిమర్రిలో 'ప్యారంగూరు' వారనే శ్రీవైష్ణవ కుటుంబం ఒకటి ఉండేది.

ఈ కుటుంబం పూర్వికులకు తాడిమర్రు బోయ సంస్థానాధీశుడొకడు ఒక అగ్రహారం ఇచ్చాడు. వేటకై వచ్చి ఆకలిగొని అలసి ఉన్న తనకు అన్నం పెట్టి ఆదరించినందుకు ఆ బోయ సంస్థానాధిపతి ప్యారంగూర్ కుటుంబంలోని ఒక పుణ్యాత్మురాలి పేరు మీదుగా రాఘవంపల్లి (రాగంపల్లి) అనే అగ్రహారాన్ని సమర్పించినందువల్ల అక్కడి శ్రోత్రియందారులైనారు ప్యారంగూరు వారు. వారు రాగంపల్లిలోనే ఉండిపోయినారు. ఈ ప్యారంగూరు వారే రామచంద్ర మాతామహకుటుంబం వారు. తమ పూర్వ పరిచయాల వల్ల, కుటుంబ బాంధవ్యాల వల్ల తాడిమర్రి సంస్థానంలోని రాగంపల్లి శ్రోత్రియందారులైన వేంకటరాఘవాచార్యుల వారు కమలాపురంలోని ప్రబంధం వారి కుటుంబపు అండదండలతో ఉన్న తిరుమల రామస్వామి తాతాచార్యుల వారి కుటుంబంతో వియ్యమందారు. కమలాపురంలోని నరసింహాచార్యుల వారి కుమారుడైన శేషాచార్యుల వారికి తమ మూడవ కూతురు జానకమ్మనిచ్చి వివాహం గావించారు. ఈ శేషాచార్యుల వారు తిరుమల తాడిమర్రి రామస్వామితాతాచార్యుల వారి మనవడు. ప్యారంగూరు వేంకటరాఘవాచార్యుల వారికి ఆరుగురు కూతుళ్లు. ఒక్కడే కుమారుడు. రామచంద్రగారి తల్లి గారైన జానకమ్మ రాఘవాచార్యుల వారి మూడవ బిడ్డ. మొదటి కూతురును రాఘవాచార్యులవారు ఆంధ్రనాటక పితామహులుగా వినుతికెక్కిన సుప్రసిద్ధ న్యాయవాది ధర్మవరం కృష్ణమాచార్యుల వారి కుమారుడికిచ్చారు. ఇందువల్ల ధర్మవరం వారి కోడలు రామచంద్రగారికి పెదతల్లి అయినారు. అందువల్లనే ధర్మవరం వారి కుటుంబంతో రామచంద్రగారి కుటుంబానికి బాగా సన్నిహితత్వం ఉండేది.

శ్రీ తిరుమల రామచంద్ర 1913 జూన్ 17 మంగళవారం జన్మించారు. అది జ్యేష్ఠ మాసం. ఆ రోజు జ్యేష్ఠానక్షత్రం. తాను మాతామహసంతాన సంతానంలో జ్యేష్ఠుడు. అంటే మాతామహుడి మనవరాండ్రు, మనవలందరిలోనూ జ్యేష్ఠుడు. ఇట్లా మూడు రకాల జ్యేష్ఠ సందర్భాలు కూడి రాకూడదనీ, అది మాతామహుడికి గండమనీ తన చిన్నతనంలో చెప్పుకొనే వారనీ, ఇందుకు నిదర్శనంగా తాను పుట్టిన ఆరు నెలల లోపే తన మాతామహుడు మరణించడంతో, ఈ విషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు తమ తల్లి దుఃఖపడేదని రామచంద్ర తమ బాల్యోదంతాలలో ప్రసక్తం చేశారు. తమ మూడేళ్ల వయసు దాకా తామూ రాగంపల్లిలోనే ఉన్నట్లు, తరువాత కమలాపురం వెళ్లినట్లు రామచంద్ర చెప్పుకున్నారు.

శ్రీ రామచంద్ర వివాహం సురపురంలో జరిగింది. ఈ సురపురం కర్ణాటాంధ్ర పొలిమేరలోని రాయచూరు జిల్లాలో గుల్బర్గాకు దగ్గరలో ఉన్నది. ఆయన అత్తగారింటి పేరు 'పెరుమాళ్ల' వారు. సురపురం కూడా స్వతంత్ర సంస్థానమే.

పెరుమాళ్ల వారు కూడా పూర్వికుల కాలంలో దక్షణ దేశం నుంచి వచ్చిన వాళ్లే. ఈ విధంగా రామచంద్ర గారు తమ బంధుబలగంగా, ఇచ్చిపుచ్చుకునే కుటుంబాలుగా చెప్పిన తిరుమల, ప్రబంధం, ప్యారంగూర్, పెరుమాళ్ల వారి కుటుంబాలు శ్రీ వైష్ణవాలయ అర్చకత్వ సంబంధంగా కొన్ని శతాబ్దాల ముందు అరవదేశం నుంచి తెలుగునాట స్థిరపడినట్లు తెలుస్తున్నది.

---

# 3. అద్భుత జీవిత సంఘటనలు

ఎవరి జీవితంలోనైనా తారసిల్లే సంఘటనలను బట్టే వాళ్ల వ్యక్తిత్వం రూపుదిద్దుకొంటుంది. కళాకారుల, సృజనాత్మక రచయితల విషయంలో ఇది మరింత సంవేద్యం. తన చుట్టూ ఉన్న వాతావరణం, పరిస్థితులు, సంఘటనలు వ్యక్తుల ఆంతర ప్రపంచాన్ని, బహిఃప్రపంచాన్ని ఆవిష్కరిస్తాయి. భౌతిక-మానసిక సంఘర్షణలే వాళ్ల దృఢనిర్ణయాలకూ, లక్ష్యశుద్ధికీ, సిద్ధికీ తోడ్పడతాయి. సీదాసాదాగా గడిచిపోయే జీవితాలలో సృజనాత్మక అభివ్యక్తికి, కళాశీలతకు ఆస్కారాలు తక్కువ.

శ్రీ తిరుమల రామచంద్ర బాల్యం, కౌమార దశలు ఒకప్పుడు మహోచ్ఛ్రాయ వైభవంతో అలరారిన హంపీ విజయనగర సంశిథిల స్మృత్యుద్దీపకాలుగా ముడిపడి ఉన్నాయి. కనుక ఆయనకు చరిత్ర, సంస్కృతి, శాసనాలు, జానపద జీవనం, దేవాలయ వాస్తు విశేషాలు మొదలైన వాటి పట్ల చిన్నతనం నుంచే ఉత్సుకతకు ఆస్కారం కలిగింది. ఆయన స్వతహాగా గొప్ప భావుకుడు. కాబట్టే పురాతత్త్వం, మానవజీవన సంవేదనలు, సంస్కృతి, సంగీత సాహిత్యాలు ఆయన భావుక లోకపు కొత్త ద్వారాలు తెరిచాయి. చిన్నప్పటి నుంచీ తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పరిశీలించే ప్రవృత్తి ప్రోదిచేసుకుని వయసుతో పాటు గాఢశీలతను అలవర-చుకొన్నాడాయన.

తమ వీథిలోనే ఇంటి ఎదురు వరసలో ఉన్న బసివి నాగమ్మ ఎవరు ? ఏమిటి ? ఆమె ఒంటరిగా ఎందుకు ఉంటుంది ? తెలుసుకోవాలని ఆయనకు ఎనిమిది తొమ్మిదేళ్ల వయసుననే కుతూహలం కలగటం ఆశ్చర్యకరమే. తాను పాఠశాలకు వెళ్లి వస్తున్నప్పుడూ ఆమె తనను వాత్సల్యంతో పరికిస్తూ ఉండేది అని రామచంద్ర ఆ రోజులను డెబ్భై ఏళ్ల తర్వాత కూడా జ్ఞాపకం చేసుకున్నారు. ఆమె ఒంటరిగా ఎందుకు ఉంటుంది ? సాయంకాలం పూట కాని ఆమె ఇంటికి ఊరి మునసబుగారు ఎందుకు రారు ? ఆమె గ్రామ మునసబు గౌడ్ర హనుమంతరావు గారి మనిషి. అయితే కమలాపురంలోనే నగరేశ్వరస్వామి దేవాలయం వద్ద ఆ హనుమంతరావు గారికి ఊరంత పెద్ద ఇల్లు ఉన్నది కదా, ఆమె అక్కడ ఎందుకు ఉండదు ? అని అంత చిన్నతనంలోనే ఆయనకు జిజ్ఞాస కలగడం ఆశ్చర్యమే. తమ తల్లి నడిగి తెలుసుకుందామని ఆయన ఆరాటపడ్డాడు. కాని తల్లి చెప్పిన విషయాలు ఆయనకు బోధపడలేదు. ఆ నాగమ్మత్తనే అడిగాడాయన. ఆమె ఏమి చెపుతుంది ? మీ

అమ్మగారిని అడగలేదా ? అని అడిగింది ! నాగమ్మతో ఒకసారి ఆయన నాగులచవితికి ఊరిబయట ఉయ్యాలలూగే ఉత్సవంలో కూడా పాల్గొన్నాడు. ప్రాజ్ఞత వచ్చిన తరువాత ఆ నాటి సమాజ దయనీయ వృత్తాంతం ఆయనకు తెలిసింది. అయినా బసివి నాగమ్మను ఆయన చిన్నచూపు చూడలేదు. మా అమ్మ తరువాత ఆమే నాకు అత్యంత పూజ్యురాలు, స్త్రీ లోకానికే ఆమె అలంకారం అని రామచంద్ర స్వీయ బాల్య జీవనోదంతాలలో రాసుకున్నారు. బసివి సంప్రదాయ మనేది ఒక విధంగా దేవదాసి వ్యవస్థ. మొదట్లో ఏ ఆదర్శంతో ఆ వ్యవస్థ రూపుదాల్చినా భూస్వామ్య వ్యవస్థలో వెలయాలి సంప్రదాయంగా అది పరిణమించింది. కమలాపురం మునసబు గౌడ్ర హనుమంతరావు ఉంచుకున్న మనిషి అయిందామె. అయినా ఆమె సత్ప్రవర్తన, మాతృత్వ ప్రవృత్తి, సంస్కారం, సాధుస్వభావం రామచంద్రను చిన్నతనంలోనే ఆకర్షించాయి. సమాజంలో స్వార్థపరులు, మోతుబరులు ఏ విధమైన అనర్థాలు తెచ్చిపెట్టగలరో శ్రీ రామచంద్ర పది పద్నాలుగేళ్ల వయసుననే తెలుసుకోవాలనే జిజ్ఞాస వ్యక్తీకరించారు.

శ్రీ రామచంద్రలో అతి చిన్న వయసు నుంచే స్పందనశీలం, జిజ్ఞాస ప్రవృత్తి కనపడతాయి. ఎనిమిదేళ్ల వయసుననే ఆయన బళ్లారిలో గాంధీజీని దర్శించాడు. అంత పసివయసుననే స్వాతంత్ర్యోద్యమం ఆయనపై గాఢంగా ముద్రితమైంది. ధర్మవరం కృష్ణమాచార్యుల వారి భవన ప్రాంగణంలో బహిరంగసభ జరిగింది కాబట్టి ఆయన తన తాతగారితో గాంధీజీకి సమీపంలోనే కూచుండి గాంధీజీ ప్రభావాన్ని తిలకించారు. సభకు వచ్చిన మహిళలు తమ బంగారు ఆభరణాలు గాంధీజీకి సమర్పించడం, ఆ విధంగా ఒక గోనె సంచి నిండా గాంధీజీకి డబ్బు, ఆభరణాలు సమర్పితం కావడం, గాంధీజీ ప్రబోధం రామచంద్ర అవచేతనలో ప్రగాఢంగా ముద్రితమై ఉంటాయి. అందువల్లనే శ్రీ రామచంద్ర పన్నెండు, పద్నాలుగేళ్ల వయసుననే తిరుపతిలో కాంగ్రెస్ వారి విదేశీ వస్తు బహిష్కారంలో, మద్యపాన నిషేధ ప్రచారంలో చురుకుగా పాల్గొన్నారు. ఊహ తెలిసినప్పటి నుంచి ఆయన ఖద్దరు ధరిస్తూ వచ్చారు. 14 సం॥ల వయసుననే తిరుపతి పట్టణ కాంగ్రెస్ ప్రచారోద్యమ కార్యదర్శి అయినారు. చిత్తూరు జిల్లా అంతా తిరిగి కాంగ్రెస్ ప్రచారం చేశారు. అంత చిన్న వయసుననే స్వాతంత్ర్యోద్యమ ప్రచారం కోసం గేయాలూ, పథ సంచలన గీతాలూ రచించారు. ఒక రోజు రాత్రి చిత్తూరు నుంచి గాంధీజీతోపాటు కారులో మద్రాసు దాకా ప్రయాణం చేశారు. ఈ సంఘటనల, సన్నివేశాల గాఢత ఆయన సముదాత్త వ్యక్తిత్వంలో, ఆదర్శ జీవితంలో తరువాత కాలంలో తమ ప్రభావం చూపాయి. సంస్కృత కళాశాలలో తిరుపతిలో చదువు కోవటానికి ఆయన వచ్చినప్పుడు ఆయన వయసు 11 సం//లే. ఉడిపి ఉత్తరాది మధ్వ పీఠాధిపతి శ్రీ సత్యజ్ఞానతీర్థుల వారు తిరుపతిలో బస చేసినప్పుడు సంస్కృత కళాశాల విద్యార్థులలో

గొప్ప పండితులు పొందే సమ్మానం రామచంద్ర చిన్ననాడే పొందారు. పన్నెండేళ్ల వయసుననే శ్రీమానవల్లి రామకృష్ణ కవిని కలిసి ఆయన మెప్పు పొందారు. అప్పుడే శ్రీ రామచంద్ర సంస్కృత రచనలను శ్రీ రామకృష్ణ కవి మెచ్చుకున్నారు.

తిరుపతిలోని గోవిందరాజస్వామి వారి శిఖర గోపురం పై త్రివర్ణ పతాకాన్ని ఎగురవేయడానికి ఆయన చేసిన వ్యూహరచన, చూపిన సాహసం అత్యంతాశ్చర్యకరమైనవి. 18 ఏళ్ల వయసుననే శ్రీరామచంద్ర స్వాతంత్ర్యోద్యమంలో సత్యాగ్రహం చేసి ఒక సంవత్సరం రాయవెల్లూరు జైలులో నిర్బంధం అనుభవించారు. తిరుమల రామచంద్ర స్వీయచరిత్ర 61 అధ్యాయాలలో తమ ముప్ఫై సంవత్సరాల జీవితానుభవాలనే గ్రంథస్థం చేశారు. ఆయన జీవితంలో అత్యద్భుతమైన సంఘటనలెన్నో ఉన్నాయి. ఇంచుమించు ప్రతి అధ్యాయంలోనూ ఒక అద్భుతమైన సంఘటన కనపడుతుంది. ఆయన ఇంకొక ముప్ఫై సంవత్సరాల జీవనోదంతాలనైనా రాసి ఉంటే ఎంతో బాగుండేదని ఆయన స్వీయచరిత్ర చదివిన పాఠకులంతా ఉత్కంఠభరితులవుతారు. వారి స్వీయచరిత్ర 61 అధ్యాయాలలో కనీసం అరవై మంది అయినా అద్భుత వ్యక్తులు తారసపడతారు. ఎనిమిదేళ్ల వయసుననే హంపీలో తుంగభద్ర నదీతీరంలో కోదండరామస్వామి దేవాలయంలో ముచ్చుకుంట శేషాచార్యుల వారి వద్ద శ్రీరామచంద్ర సంస్కృత పంచకావ్యాలు చదవడం, అడవిలో క్రూరమృగ సంచారం మధ్య గురువు గారిని శుశ్రూషించి భయంభయంతో సంస్కృత విద్యాభ్యాసం చేయడం, అటు తర్వాత ఆనెగొందిలో తమ బంధువైన అంబాళం వెంబారు రామాచార్యుల వారి వద్ద సంస్కృత విద్యాభ్యాసాన్ని కొనసాగించడం, ఆ చిన్న వయసుననే వారు ఆకృతించుకున్న ఆనెగొంది వైష్ణవ కుటుంబ జీవన సంస్కృతి విశేషాలు ఎవరి జీవితంలోనైనా అసాధారణంగా సంఘటించేవే. ఆనెగొందిలో నలభైదాకా వైష్ణవాలయాలుండేవనీ, గోకులాష్టమి కోలాహలంగా నిర్వహించే వారని, రామచంద్ర రాశారు. అనెగొంది రాజకుటుంబం వారి సంగతులు, శుభకార్యాలు వారి జీవన ప్రవృత్తి ఒక అత్యద్భుత కావ్య రీతిలో రామచంద్ర రాశారు.

సంతాన భాగ్యంపొందని ఒక ముద్దరాలు సంతానం కోసం పడిన తపన, తమ ఇంట పనిచేసే పరిచారికతో ఒప్పందం కుదుర్చుకుని ఆ పరిచారిక నెలలు మోసి కనబోతున్న బిడ్డను తన బిడ్డగా చూపుకొని లోకాన్ని వంచించడానికి ఆమె గర్భవతిగా నటిస్తూ దురదృష్టవశాత్తూ నలుగురి ముందు నవ్వులపాలు కావడం తమ ఆనెగొంది జ్ఞాపకాలలో రాశారు రామచంద్ర. ఇది ఒక అద్భుత వృత్తాంతం.

తుంగభద్రలోకి ఎక్కడ నుంచో ఒక మొసలి వచ్చింది. అనెగొంది ప్రజలందరినీ తీవ్ర ఆందోళనకు గురిచేసింది. అనెగొంది పరిపాలకులప్పటికి యుక్త వయస్కులు కారు. రాజు లేడు. రాణి కుప్పమ్మ సాహెబా పరిపాలిస్తున్నారు. ఆమె ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆ మొసలి నుంచి ఊరికి ఉపద్రవాన్ని తప్పించ-

లేకపోయింది. అప్పుడు అనెగొందిలోనే ఉన్న ఒక ముసలమ్మ ఆ మొసలిని మట్టుపెట్టే ఉపాయం చెప్పింది. ఒక మేక పిల్లను చంపి దానిలోని పదార్థాన్ని తొలగించి గుల్ల సున్నం కూరి మాంసపు పచ్చి ఆరకుండానే ఆ మొసలికి కనపడే విధంగా ఒడ్డున కట్టి ఉంచడమే ఆ ఉపాయం. ఆ విధంగా ఆ గ్రామ ప్రజలు చేయడం, ఆ మొసలి ఆ మేకను తిని భయంకరంగా మరణించడం రామచంద్ర ఒక అధ్యాయం కూర్చారు స్వీయచరిత్రలో.

తాము తిరుపతి సంస్కృత కళాశాలలో చదువుతున్నప్పుడు తన సహాధ్యాయులైన విద్యార్థులిద్దరు ఆ చదువు ఏ మాత్రం ఒంటపట్టక నిరాశోపహతులైనదీ, అవమానం పాలైనదీ వివరిస్తూ ఆనంతరకాలంలో వారెంత వృద్ధిలోకి వచ్చిందీ ఒక అధ్యాయంలో వివరించారు రామచంద్ర. మొద్దబ్బాయిలు మహా మేధావులైన కథ' అనే ఈ అధ్యాయం అత్యంత ఉత్కంఠభరితంగా చదివిస్తుంది పాఠకులను.

రాయవెల్లూరు కారాగారవాసంలో తమకు సన్నిహితుడైన హనుమంతరెడ్డి అనే 'కాన్విక్టు వార్డరు' కథ ఎంతో ఆసక్తికరంగా రాశారు రామచంద్ర.ఆ కారాగార వాసంలోనే తమకు తారసపడ్డ విప్లవపంథానుయాయులైన ప్రతూల్‌చంద్ర గంగూలీ, జీవనలాల్ ఛటర్జీ, సురేంద్ర మోహన్ ఘోష్‌ల వృత్తాంతం ఎంతో ఆశ్చర్యకరం. వారి ప్రభావానికి లోనై రామచంద్ర రహస్య విప్లవోత్సుకులు కావడం, భగత్‌సింగ్‌ను అండమాన్ జైలుకు తరలించడానికి మద్రాసు తీసుకొని పోతున్నారన్న వదంతి వ్యాపించగా, ఆ రైలును అటకాయించి భగత్‌సింగ్‌ను తప్పించాలన్న సాహసంలోపాల్గొనడానికి చేసిన వ్యూహరచన అత్యద్భుత సంఘటనలు.

రామచంద్ర లాహోర్‌లో పంజాబు విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ సూచీకర్తగా సుమారు రెండేళ్లు పనిచేశారు. రెండు వేల తాళపత్ర గ్రంథాల వివరణాత్మక సూచి తయారు చేశారు. ఆయన లాహోర్‌లో ఉన్నప్పుడు అక్కడి కవిపండితులు, మేధావులు ఆయనకు ఎందరో పరిచయమైనారు. లాహోర్ విశ్వవిద్యాలయాహూతులై సర్వేపల్లి రాధాకృష్ణ, మహాకవి వళ్లత్తోల్, కాశీవిశ్వవిద్యాలయ మీమాంసాచార్యులు చిన్నస్వామి శాస్త్రి వంటి మహామహులెందరో విచ్చేసినప్పుడు వారి ప్రసంగాలు విన్నారు రామచంద్ర.

సుమారు 2 సం॥లు రామచంద్ర రెండో ప్రపంచ యుద్ధకాలంలో సైన్యంలో హవల్దార్ గుమాస్తాగా పని చేశారు. సర్ విన్‌స్టన్ చర్చిల్ బ్రిటిష్ సైనికులను ఉత్తేజ పరచడానికి క్వెట్టా రాగా, ఆ సైనిక కవాతు ప్రదర్శనలో రామచంద్ర పాల్గొని చర్చిల్‌ను దగ్గరగా చూశారు. పర్షియా సరిహద్దు దాకా భారత సైన్యం కార్య కలాపాలలో ఆయన సంచరించారు. ఇవన్నీ ఆయన జీవితంలో అత్యద్భుతమైన సంఘటనలే కదా!!

# 4. బాల్య కౌమారాలు

తిరుమల రామచంద్రగారి బాల్యమంతా కమలాపురంలోనూ, కౌమారమంతా తిరుపతిలోనూ గడిచాయని చెప్పాలి. మధ్యలో కొంతకాలం హంపీ విజయనగరంలోని కోదండ రామస్వామి ఆలయంలోనూ, ఆనెగొందిలోనూ గురువులతో గడిపినా వారం పదిరోజుల కోసారి కమలాపురం వస్తూనే ఉండేవారు.

ఆయన శైశవం అంటే మూడేళ్ల వయసు దాకా అమ్మమ్మ గారింటనే గడిచింది. రాగంపల్లిలో ఉండగానే అంటే అత్యాశ్చర్యకంగా మూడేళ్ల పసి వయసుననే ఆయనకు అక్షరాభ్యాసం జరిగినట్లు ఆయన చెప్పుకున్నారు. మరీ శైశవం కాబట్టి వల్లించలేదు కాని గురువైన చల్లా సుబ్బారాయుడు తనకు అమరం, ఆంధ్రనామ సంగ్రహం చెప్పటం గుర్తుందని స్వీయచరిత్రలో ఆయనే చెప్పుకున్నారు.

నాలుగో ఏడు గడుస్తుండగా ఆయన తల్లితో కలిసి కమలాపురం వచ్చేశారు. ఐదోఏట ఆయన్ను బళ్లో వేశారు. ఈశ్వరయ్య నవరు అనే వీధి బడి పంతులు వద్ద ఆయన ప్రాథమిక తరగతులు చదివారు. గర్భాష్టమంలో ఆయనకు ఉపనయనం కూడా జరిగింది. అప్పుడిక ఆయన ఇంగ్లీషు చదవాలా ? సంస్కృతం చదవాలా ? అనే మీమాంస వచ్చింది కుటుంబంలో. కుటుంబ సభ్యులలో తర్జనభర్జనలు జరిగాయి. రామచంద్ర తండ్రిగారూ, పినతండ్రిగారూ ఆయనను ఇంగ్లీషు చదివించాలనీ, తల్లీ, తాతగారూ ఆయన సంస్కృత విద్వాంసుడు కావాలనీ అభిలషించారు. తాత్కాలికంగా ఇంగ్లీషు పక్షం వారు మొగ్గినా కమలాపురంలో ఆయనకు ఇంగ్లీషు చెప్పే వాళ్లెవరున్నారు ? తమ బంధువొకరు ఆ ఊరికి పోస్టుమాస్టరుగా వచ్చారు. ఆయన ఇంగ్లీషు చెపుతారని తెలిసి రామచంద్రను ఆయన దగ్గరకు పంపారు కొన్నాళ్లు. ఆ తరవాత కమలాపురంలో ఉన్న మిడిల్ స్కూలుకు హెడ్ మాస్టరుగా దేశీయ క్రైస్తవుడు ఒకరు వచ్చారనీ, ఆయన ఇంగ్లీషు చెప్పి పిల్లలను ప్రైవేట్‌గా పరీక్షలకు పంపుతారనీ తెలిసి ఆయన దగ్గర చదివించారు. ఆ రోజుల్లో మిడిల్ స్కూలు పెద్ద పరీక్షకు, ప్రైవేట్‌గా చదివే అవకాశం ఉండేది. ఇంతలో బళ్లారిలో తమకు బాగా తెలిసిన బంధువొకరు పిల్లలకు ట్యూషన్ చెప్పి మెట్రిక్యులేషన్ పరీక్షకు తర్ఫీదు చేస్తున్నారని తెలిసి, దొడ్డమ్మ వాళ్ల ఇంట్లో ఉండి రామచంద్ర ఆ మేస్టరు వద్దే ఇంగ్లీషు చదివే ఏర్పాటు చేశారు. అయితే ఆ ఉపాధ్యాయుడు చండశాసనుడు.

చీటికి మాటికి పిల్లలను దండించేవాడు. కాబట్టి రామచంద్ర అక్కడ ఉండలేకపోయినారు.

మళ్లీ ఆయన చదువు సమస్య మొదటికి వచ్చింది. ఇంతలో తిరుమల వారి బంధువొకరు ముచ్చుకుంట శేషాచార్యులనే వారు ఏవో గృహ సమస్యల వల్ల హంపీ విజయనగరం దేవాలయంలో దేనిలోనో జపతపాలతో గడపాలని, ఆ ఏర్పాట్లను గూర్చి కమలాపురం వచ్చారు. ఆయన గొప్ప విద్వాంసుడు. అందువల్ల రామచంద్ర గారి తాతగారు 'పిల్లవాడు మీతో ఉంటాడు. సంస్కృత కావ్యాలు చెప్పండి' అని శేషాచార్యుల వారిని అర్థించారు. ఆ విధంగా ఏడెనిమిదేళ్ల వయసుననే రామచంద్ర కోదండ రామస్వామి దేవాలయంలో శేషాచార్యుల వారితో ఉండి కొన్ని నెలలు సంస్కృతం నేర్చుకున్నారు. కాని భయంకరమైన వాతావరణంలో ఆయనక్కడ ఉండలేకపోయినాడు. రోజూ రెండు వందల మెట్లు దిగి తుంగభద్ర నుంచి నీళ్లు తీసుకొనివచ్చి గురువు గారికి వేడినీళ్లు అమర్చవలసి వచ్చేది రామచంద్రకు. అక్కడ చిరుత పులులు యథేచ్ఛగా సంచరించేవి. దానాదీనా రామచంద్ర అక్కడే చదువు సాగించటానికి ఇష్టపడలేదు. మళ్లీ మొదటికి వచ్చింది ఆయన చదువు. అప్పుడిక ఆయనను ఆనెగొందిలో తమ బంధువైన అంబాళం వెంబారు రామాచార్యుల వారి వద్ద చదివించాలని కుటుంబం నిర్ణయించింది. ఈ రామాచార్యుల వారు మహా విద్వాంసులు. ఆనెగొంది రాజాస్థాన పండితులు. మైసూరు మహారాజా వారి సంస్కృత కళాశాల విద్వత్పరీక్షలకు విద్యార్థులకు శిక్షణ ఇస్తూ ఉండేవారు. అంతేకాక రామాచార్యుల వారికీ తిరుమల వారి కుటుంబానికీ దగ్గర బాంధవ్యం కూడా ఉంది. రామాచార్యుల వారి గతించిన తమ్ముడికి ఇల్లాలు కొండమ్మగారు. ఈమె రామచంద్రగారికి చిన్ననాయనమ్మేను. అందువల్ల కొండమ్మవ్వ, రామచంద్రను ఆనెగొందిలో ఉంచి తమ బావగారైన రామాచార్యులగారి వద్ద చదివించాల్సిందిగా రామచంద్ర కుటుంబానికి నచ్చచెప్పింది. అంతేకాక అనెగొందిలో ఇంగ్లీషు పాఠశాల కూడా ఉంది. అక్కడ రామచంద్రుడు ఇంగ్లీషు కూడా చదువుకోవచ్చు అని ఒప్పించిందామె.

రామచంద్ర ఆనెగొందిలో ఉండి మూడు సంవత్సరాలు అంబాళం వెంబారు రామాచార్యుల వారి వద్ద సంస్కృత కావ్యాలు, అలంకార శాస్త్రాలు చదివారు. ఇంగ్లీషు చెప్పే స్కూల్లో ఇంగ్లీషు, గణితమూ కూడా అభ్యసించారు. ఆ స్కూల్లో ఉర్దూ కూడా బోధించేవారు కాబట్టి ఆ భాషను కూడా రామచంద్ర నేర్చుకున్నారు. అయితే ఇంతలో ఆనెగొందికి తమ బంధువైన వేంకటరంగాచార్యులనే యువకులు రావటం తటస్థించింది. ఈ వేంకట రంగాచార్యులవారప్పుడు తిరుపతి మహంతు వారు నిర్వహిస్తున్న సంస్కృత కళాశాలలో చదువుతున్నారు. తిరుపతిలోని సంస్కృత

పాఠశాలకు అప్పట్లో అఖిల భారత ఖ్యాతి ఉండేది. దేశంలోని వివిధ ప్రాంతాల విద్యార్థులు వచ్చి అక్కడ చదువుకునే వారు. గొప్ప విద్వాంసులు అక్కడి అధ్యాపక, వర్గంలో ఉండేవారు. ఏభై మంది అధ్యాపక విద్వాంసులు, వందల సంఖ్యలో విద్యార్థులు, గొప్ప పరీక్షలు, అని వేంకటరంగాచార్యుల వారు అప్పట్లో పది పదకొండేళ్ల బాలుడైన రామచంద్రకు ఉత్కంఠ కలగజేశారు. అందువల్ల రామచంద్రకు ఆనెగొంది చదువు మొహం మొత్తింది. అక్కడే ఉండి చదువు కొనసాగించడానికాయన ఇష్టపడలేదు. గురువు గారి కుటుంబమూ, తన కుటుంబమూ ఎంతగా నచ్చచెప్పినా రామచంద్ర పట్టుదల సడలలేదు. అందువల్ల తాతగారు నరసింహాచార్యుల వారు 1924వ సంవత్సరాంతంలో రామచంద్రను తీసుకొని వెళ్లి తిరుపతి సంస్కృత కళాశాలలో చేర్చారు. అప్పటికి రామచంద్రకు పదకొండేళ్లు పూర్తిగా నిండలేదు.

శ్రీరామచంద్ర తిరుపతి సంస్కృత కళాశాలలో ఏడు సంవత్సరాలు చదివారు. ఆయన వ్యాకరణ శిరోమణి, సాహిత్య శిరోమణి పరీక్షల కోసం శ్రద్ధాసక్తులతో విద్యార్జన చేశారు. అయితే ఇంతలో ఆయన జీవిత పథంలో ఈ గమ్యాన్ని అంతా మార్చివేసే పెనుమార్పు వచ్చి పడింది.

1930వ సంవత్సరం నాటికి భారత స్వాతంత్ర్యోద్యమం గాంధీజీ నాయకత్వంలో ముమ్మరమైంది. భారత స్వాతంత్ర్యోద్యమం 1905 నుంచి 20 వరకు ఒక ఘట్టం. ఆ తరువాత పది సంవత్సరాలు మరొక ప్రధానమైన ఘట్టం. ఆరత్వాత 15 సంవత్సరాలు ఉద్యమ సాఫల్య నిరూపణ ఘట్టంగా సాగింది. 1930వ సంవత్సరం నుంచి మొదలైన విదేశీ వస్త్ర బహిష్కారం, మద్యపాన నిషేధం, ఉప్పు సత్యాగ్రహం వంటి ప్రధాన కార్యక్రమాలలో వేలాది మంది సత్యాగ్రహులు జైళ్ల పాలైనారు. యువతలో స్వాతంత్ర్య సంపాదన కాంక్ష ఉత్తుంగ తరంగితమైంది.

తిరుపతి భారతదేశంలోని ప్రధాన పుణ్యక్షేత్రాలలో అతి విశిష్టమైనది. ఏడాది పొడవునా అక్కడి జనసమ్మర్దం మరే పుణ్యక్షేత్రంలోనూ కన్పించదు. సమస్త భారతదేశం నలుమూలల నుండి అక్కడికి తీర్థయాత్రాపరులు వస్తారు. తిరుపతి సంస్కృత కళాశాలలో చదువుకోవటానికి ఉత్తరప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర ప్రాంతాల నుంచి విద్యార్థులు వచ్చేవాళ్లు ఆ కాలంలో. ఇక దక్షిణాది ప్రాంతాల సంగతి చెప్పనే అక్కరలేదు. ఎందరెందరో రహస్య సంఘాల వ్యక్తులు కూడా తిరుపతికి వస్తూ ఉండేవారు. తిరుమల రామచంద్రను స్వాతంత్ర్యోద్యమం చాలా ఉత్తేజపరచింది. ఆవేశపరచింది. అంత చిన్న వయసులోనే స్వాతంత్ర్యోద్యమానికి ఆయన సర్వాత్మనా అంకితమైపోయినారు. చిత్తూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు పార్థసారథి అయ్యంగారితో జిల్లా అంతా కౌమారదశ కూడా దాటని రామచంద్ర పర్యటించారు.

తిరుపతి తాలూకా కాంగ్రెసు అధ్యక్షులైన నరసింహాచార్యులు గారికి సన్నిహితులైనారు. జిల్లా కార్యక్రమాలతో సమన్వయం సమకూర్చుకోవడానికి తిరుమల రామచంద్ర ఆ పట్టణ కార్యనిర్వాహక సంఘ కార్యదర్శి అయినారు. సంస్కృత కళాశాలలో తన సహాధ్యాయుడైన కలచవీడు శ్రీవివాసాచార్యుల సహాయంతో గోవిందరాజస్వామి దేవాలయంపై స్వతంత్ర పతాకావిష్కరణం చేశారు. కాని పోలీసులు వెంటనే దాన్ని తొలగించడంతో దేవాలయం ఆవరణలోనే ఉన్న నమ్మాళ్వారు మందిరం గోపురం పై పతాకావిష్కరణ చేశారు. దానితో తిరుపతి పట్టణ పోలీసు యంత్రాంగం ఆయనపై కన్నెర్ర చేసింది. రామచంద్ర స్వయంగా వెళ్ళి పోలీసు స్టేషన్‌లోనే నిషిద్ధ కరపత్రాలను పంచగా ఆయనను అరెస్టు చేసి చంద్రగిరి కోర్టులో నేరవిచారణకు హాజరు పరిచారు. 1932 ఫిబ్రవరి 6వ తేదీన ఆయనకు కారాగార శిక్ష విధించారు. ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్ష ఆయననకు సంప్రాప్తమైంది. ఆయనను ముందు రాయవెల్లూరు జైలుకు తీసుకొని వెళ్ళి అక్కడ నుంచి తిరుచిరాపల్లి కారాగారానికి మార్చారు. అప్పటికాయనకు పందొమ్మిదో ఏడు నడుస్తున్నది. ఆ వయసుతో ఆయన కౌమార దశ ముగింపుకు వస్తుంది. తిరుపతి సంస్కృత కళాశాలలో రామచంద్ర విద్యార్జనం చేసిన ఆరేడు సంవత్సరాలు ఆయన కౌమారదశ అన్నమాట.

బాల్య–కౌమార దశల నుంచీ ఆయన జ్ఞాపకశక్తి అపారం. కమలాపురంలో ప్రాథమిక విద్యాభ్యాసం చేస్తున్న, 5, 6 సంవత్సరాల వయసు నుంచీ ప్రపంచ పరిశీలనాసక్తి, అమోఘమైన గ్రహణ ధారణ శక్తులు ఆయనను అంటిపెట్టుకునే ఉన్నాయి.

అప్పట్లో మధ్యప్రదేశ్‌లోని అతిచిన్న స్వతంత్ర సంస్థానమైన పన్నా రాజకుమారుడు పినతండ్రితో తనకు కలిగిన ఘర్షణలో క్షణికోద్రేకావేశాల ప్రభావంతో పినతండ్రిని కాల్చి చంపగా, బ్రిటిషు ప్రభుత్వం ఆ పన్నారాజును బళ్లారిలో గృహనిర్బంధంలో ఉంచింది. బళ్లారి జిల్లా దాటి ఆయన పోరాదు. ఒకవేళ ఆ జిల్లాలో ఆయన ఎక్కడికైనా పోవాలనుకున్నా ముందుగా అధికార యంత్రాంగం అనుమతి పొందాలి. ఆయన తరచు హంపీ విజయనగరం శైలాటవులలో వేటాడటానికి కమలాపురం దాకా పెద్ద ఫోర్డు కారులో వస్తుండేవారు. ఈ పన్నారాజకుమారుడికి రామచంద్ర పినతండ్రితో బాగా స్నేహం కలిసింది. పల్లెటూరికి అంత పెద్ద కారు రాగానే ఊళ్లోని పిల్లలంతా పన్నారాజకుమారుడి చుట్టూ బిలబిలచేరేవారు. ఆయన వేట కథలు వినాలని ఆరేళ్ల వయసు దాటని రామచంద్రకు కుతూహలం. పినతండ్రి శ్రీనివాసాచార్యులవారి ద్వారా ఆ రాజకుమారుడి వేట అనుభవాలు వినాలనుందని రామచంద్ర కోరారుట. అప్పుడు పన్నారాజు నవ్వుతూ

నీకు హిందీగాని, ఇంగ్లీషు కాని రాదు కదా ? ఎలా తెలుసుకుంటావు అన్నారుట.

రామచంద్ర ప్రాథమిక తరగతులలో చదివిన వాచక పుస్తకాల పాఠాలను గూర్చి కూడా స్వీయచరిత్రలో చెప్పారు. క్లాసుల ప్రారంభానికి ముందు కన్నడంలో పిల్లలచే పాడించే దైవస్తుతి గీతం గుర్తుంచుకున్నారు. బ్రిటిషు రాజభక్తి సూచకంగా పాఠశాలల్లో ఆ కాలంలో చదివించే రాజభక్తి గీతం ప్రస్తావించారు.

తమకు మూడేళ్ల వయసు నుంచే తల్లిగారు వల్లె వేయించిన దైవస్తోత్రాలు, స్తుతులు, గుర్తుంచుకున్నారు. శ్రీవైష్ణవ కుటుంబ సంప్రదాయమైన సమాశ్రయణం (మనోవాక్కాయకర్మల ద్వారా భగవంతుడి పట్ల, భగవద్భక్తుల పట్ల దాసభావం) దీక్షావిధి పదేళ్ల వయసుననే పొందారు.

గొప్ప శ్రీవైష్ణవ సంస్కారం ఆయన జీవిత కాలం అంతాపాటించారు.

# 5. స్వాతంత్ర్యోద్యమ ప్రస్థానం

కౌమారదశ దాటి యౌవనంలోకి ప్రవేశిస్తున్న రామచంద్ర జీవన వ్యక్తిత్వ కాలం నాటికి భారతదేశంలో యువకులెందరో స్వాతంత్ర్యోద్యమం పట్ల ఆత్మ సమర్పణోద్యుక్తులై వేల సంఖ్యలో స్వాతంత్ర్యోద్యమంలోకి పరుగులు తీశారు. వారు తమ భవిష్యత్తును కాని తమ కుటుంబాల మనుగడను కాని లక్ష్యపెట్టలేదు.

స్వాతంత్ర్యోద్యమకాలం నాటి దేశ భక్తుల మానసికోత్తేజాన్ని, ఉద్వేగాన్ని చిలకమర్తి లక్ష్మీనరసింహం ఇల్లా వర్ణించారు. 'దేశభక్తులు ఆ కాలంలో చెరసాలలనే వెన్నెల విహారాలకనువైన మహా భవనపు చంద్రశాలలుగా భావించారు. తమ చేతులకు వేసే సంకెళ్లనే పూలదండలుగా, ముతక కంబళ్ళనే పట్టు సెల్లాలుగా స్వీకరించారు. తమకు ఇచ్చే చోడి అంబలినే పరమాన్నంగా భావించారు' అన్నారాయన. మాతృ దేశం పట్ల ప్రేమ వల్ల ఎటువంటి కష్టాన్నైనా అది తమకు అపురూపమైన సుఖంగానే భావిస్తారు దేశభక్తులు అని దీని అర్థం.

తన మతాన్ని, తన సంస్కృతిని, తన కుటుంబాన్ని సర్వసాధారణంగా మానవుడు ప్రేమిస్తాడు. భావుకుడు, కొంతలో కొంత విద్యావంతుడు, చారిత్రక పరిణామాలను తెలిసిన వాడైతే తన కుటుంబం కన్నా దేశాన్నే మిన్నగా ప్రేమిస్తాడు. తన దేశం దీనదశ ననుభవిస్తుంటే ఎంతో ఉద్వేగం చెందుతాడు. దుఃఖపడతాడు. మార్గదర్శనం లభించిందా ఆ మహత్తర లక్ష్యసాధనకు అంకితమవుతాడు.

ఇందువల్లనే మహాత్మగాంధీ సారథ్యంలో భారత స్వాతంత్ర్యోద్యమం దేశభక్తులెందరినో ఆకర్షించింది. ఆ మహాయజ్ఞంలో తాము సమిధలు కావడానికి వారంతా ఉత్సాహం చూపారు. లోకవృత్తాన్ని తెలుసుకొనే ఊహ రూపొందుతున్న అతిచిన్న వయసు నుంచీ రామచంద్ర కుటుంబంలో జాతీయోద్యమ అభినివేశం కనపడుతూనే ఉంది. తన తాతతండ్రులు కాంగ్రెస్ సభలకు హాజరవుతూ ఉండేవారనీ, ఖద్దరునే ధరించేవారనీ, తమ ఇంట్లో ఖద్దరు నూలు వడికేవారనీ, దానిని ప్రారంభించిన నాటి నుంచీ ఆంధ్ర పత్రిక తెప్పిస్తూ ఉండే వారనీ, తనకు ఏడెనిమిదేళ్ల వయసు నుంచీ అర్థమైనా కాకపోయినా కాంగ్రెస్ సత్యాగ్రహానికి సంబంధించిన ఛాయాచిత్రాలు, వార్తలు ఆసక్తితో గమనిస్తూ ఉండే వాడినని రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పుకున్నారు.

బళ్లారిలో న్యాయవాదవృత్తిలో ఉన్న కోలాచలం వెంకటరావుగారనే గొప్పదేశభక్తులు, జాతీయోద్యమాభిమాని, కమలాపురంలో తమకు గల భూముల

కౌలు కదపాలు, శిస్తులు చూసుకోవటానికి వచ్చినప్పుడు, ఆ వ్యవహారాలన్నీ తమ కుటుంబ పెద్దలే చూసేవారు కాబట్టి వెంకటరావుగారు తమ ఇంట్లోనే బసచేసే వారనీ, అప్పుడు తమ పెద్దలతో ఆయన దేశ రాజకీయాలు, స్వాతంత్ర్యోద్యమం గూర్చి చర్చిస్తుండే వారని కూడా రామచంద్ర రాశారు. ఆ చర్చలు తమకు అర్థం కాకపోయినా ఆసక్తి కలిగించేవని కూడా రాశారాయన.

తమకు ఎనిమిదేళ్ల వయసున గాంధీజీ బళ్లారి వస్తున్నారని తెలిసి తమ తాతాగారు బళ్లారి వెళ్లే సన్నాహంలో ఉండగా తాము కూడా తాతగారిని ఒప్పించి బళ్లారి వెళ్లామనీ, అక్కడ ధర్మవరం వారి బంగళా కాంపౌండులో జరిగిన గొప్ప సభలో గాంధీజీ అన్నమాటలు తమకెంతో ఉత్సుకత కలిగించాయనీ రామచంద్ర స్వీయజీవనోదంతాలలో చెప్పారు.

అందువల్ల ప్రభావ శీలమైన వయసుననే స్వాతంత్ర్యోద్యమం రామచంద్రను బాగా ఆకర్షించింది. ఆయన పదేళ్ల వయసుననే పినతండ్రి గారితో కలిసి కాకినాడ కాంగ్రెస్‌కు వెళ్లారు. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఈ కాంగ్రెస్ సమావేశం అపూర్వమైన సంచలనం సృష్టించింది. గాంధీ మహాత్ముడప్పుడు యరవాడ జైలులో ఉన్నాడు కనుక ఈ కాంగ్రెసు సమావేశం మరింత ప్రాధాన్యం సంతరించుకుంది. భారతదేశం నలుమూలల నుంచి అగ్రశ్రేణి నాయకులంతా వచ్చారు. సభా కార్యక్రమాలు, దేశభక్తి వ్యగ్రత సూచకంగా హిందీ భాషలోనే పట్టుదలగా నిర్వహించినట్లు కొండా వెంకటప్పయ్యగారి స్వీయచరిత్ర నుంచి తెలుస్తున్నది.

రామచంద్రకు పది సంవత్సరాల వయసుననే కాంగ్రెస్ సభలకు వెళ్లాలన్న ఉత్సాహం కలగడం ఆశ్చర్యజనకమే. తిరుపతిలో సంస్కృత కాళాశాలలో చదువుకోడానికి వచ్చిన తర్వాత స్వాతంత్ర్యోద్యమం పట్ల రామచంద్రలో తాదాత్మ్యం మరింత ప్రబుద్ధమైంది. సభా సమావేశాలకు దేశభక్తి స్ఫోరకమైన శ్లోకాలు, గేయాలు రచించవలసిందని సభానిర్వాహకులు ఆయనను కోరేవారుట. 1924వ సంవత్సరాంతంలో రామచంద్ర తిరుపతి కళాశాలలో ప్రవేశించారు. స్థానిక స్వాతంత్ర్యోద్యమంలో ఐదారేళ్లు తలమున్కలుగా పాల్గొన్నారు. 1930వ సంవత్సరానికి భారత స్వాతంత్ర్యోద్యమం ఒక గొప్ప పరిణామ ఘట్టానికి చేరుకున్నది. ఈ కుటుంబ నేపథ్యంలో రామచంద్ర ఆయన బాల్యంలోనే పూర్తిగా స్వాతంత్ర్యోద్యమంలో నిమగ్నుడు కావడం సహజ పరిణామమే.

శిక్ష పడగానే రాయవెల్లూరు జైలు నుంచి తిరుచిరాపల్లికి ఆయనను తరలించారు. సుమారు ఒక సంవత్సరం శిక్షననుభవించారు రామచంద్ర. అప్పట్లో వెయ్యి మంది దాకా ఆ జైల్లో సత్యాగ్రహ ఖైదీలున్నట్లు రామచంద్ర రాశారు. దక్షిణ భారతంలోని ప్రసిద్ధ నాయకులు, ఉద్యమ నిర్వాహకులు అంతా ఆ జైల్లో శిక్షలనుభవించారు. ఉత్తర భారతదేశం నుంచి కూడా కొందరు ఆ కారాగారంలో

నిర్బంధితులై ఉండే వారని రామచంద్ర భోగట్టా. ఎవరికైనా తమ పుట్టి పెరిగిన ఊరు, జిల్లా, ప్రాంతమూ అంటే అభిమానముంటుంది. జీవితానుబంధం ఉంటుంది. ఇది మానవ సహజం. తిరుమల రామచంద్ర తిరుచిరాపల్లి జైలులో ప్రవేశించగానే హనుమంతరెడ్డి అనే 'కన్విక్టు వార్డరు' ఆయననెంతో అభిమానంగా ఆహ్వానించాడు. కారణమేమంటే తాను కూడా బళ్లారి జిల్లా వాడు కావటం. పట్టరాని క్షణికోద్రేకంలో, ఆవేశంలో ఈ హనుమంతరెడ్డి భార్య శీలాన్ని శంకించుకొని ఆమెను హత్య చేసి యావజ్జీవ కారాగార శిక్ష అనుభవిస్తున్నాడు. చాలా జైళ్లలో ఉన్న తర్వాత అతడు రాయవెల్లూరులో శిక్షాకాలం పూర్తి చేసుకుంటున్నాడు. అయితే హనుమంతరెడ్డి చదువుకున్నవాడు, పాపభీతి కలవాడు. అతడి సత్ప్రవర్తనకు ప్రతిఫలంగా తిరుచిరాపల్లి జైలులో అతణ్ని కాన్విక్టు వార్డరుగా చేశారు. చాటుమాటున జైలులో కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కలిగిస్తానని హనుమంతరెడ్డి చెప్పినా అందుకు రామచంద్ర అంగీకరించలేదు. కఠినశిక్ష నుంచి మెరుగైన శ్రేణి శిక్షకు అంటే 'సి' క్లాసు నుంచి 'బి' క్లాసుకు మార్పించవలసిందిగా అభ్యర్థించవలసిందని హనుమంతరెడ్డి సలహా చెప్పినా రామచంద్ర అందుకు సమ్మతించలేదు. 8 అడుగుల పొడుపు, 5 అడుగుల వెడల్పు గల ఒంటరి గదిలో రామచంద్ర కొన్ని నెలలు నిర్బంధం అనుభవించారు. కంకర కొట్టడం, ముడిఉన్ని బేళ్ల నుంచి ఉన్ని విడిపించడం, కొబ్బరి పీచు పీకడం వంటి బాధాకరమైన కాయకష్టపు పనులు రామచంద్ర చేత జైలు అధికారులు చేయించేవారు. దేశస్వాతంత్ర్యం కోసం కదా ఈ కష్టసహిష్ణుత అని రామచంద్ర దేనికీ బాధపడలేదు.

స్వాతంత్ర్యోద్యమం మరింత ఉద్ధృతమైనందు వల్లనూ, సత్యాగ్రహులు అధిక సంఖ్యలో జైళ్లు నింపుతున్నందు వల్లనూ తిరుచిరాపల్లి కారాగారంలో సత్యాగ్రహుల నిర్బంధావాసాన్ని సామూహికం చేశారు. ఒక పెద్ద హాలులో పక్కపక్కనే సిమెంటు దిమ్మెలు ఏర్పాటు చేసి వాటి పైన సత్యాగ్రహులు నిద్రపోయేట్లు, విశ్రాంతి కాలం గడిపేట్లు జైలు అధికారులు ఏర్పాటు చేశారు. అందువల్ల వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన నిర్బంధితులతో పరిచయం, సాన్నిహిత్యం పెరిగినట్లు రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పారు. ఆ జైలు విశాల భారత దేశపు ప్రతీకాత్మకంగా ఉండేదని రామచంద్ర అభిప్రాయపడ్డారు.

ఈ కారాగార నిర్బంధంలోనే తమకు కొందరు విప్లవకారులతో పరిచయమైందనీ, వారి సిద్ధాంత ప్రభావానికి కూడా తాము లోనైనామనీ, జైలు నుంచి విడుదలైన తర్వాత రహస్య కార్యకలాపాలలో పాల్గొనాలని తమలో కొందరు ఒక బృందంగా నిర్ణయించుకున్నామని కూడా రామచంద్ర స్వీయచరిత్ర కథనం. ఇందువల్లనే మద్రాసు కుట్ర కేసులో ఆయన చిక్కుకోవడం తటస్థించింది. తిరుపతి కళాశాలలో చదువు కొనసాగించడానికి అవకాశం లేక నెల్లూరు సంస్కృత వేద కళాశాలలో ఆయన ప్రవేశించి నెల్లూరు పరిసరాలలో సాయుధ విప్లవ రహస్య

కార్యకలాపాలలో తిరుచిరాపల్లి జైలు మిత్రుల ప్రోద్బలం వల్ల చురుకుగా పాల్గొన్నాడు. సంస్కృత కళాశాల విద్యార్థి కావడం, వేషభాషలలో సాధుశీలత ఆయనకు కవచంగా తోడ్పడతాయని రహస్య కార్యకలాపాలలో మిత్రులీయనకు మారణాయుధాలు భద్రపరిచే బాధ్యత ప్రత్యేకించి అప్పగించారు. అప్పట్లో భగత్‌సింగ్ కుట్ర కేసు దేశంలో గొప్ప సంచలనం సృష్టించింది. భగత్‌సింగ్ అనుచరులను అండమాన్ జైలుకు తరలిస్తున్నది బ్రిటిషు ప్రభుత్వమని ప్రవాదం ప్రచారం కావడంతో వారు ప్రయాణం చేసే రైలును అటకాయించి ఆ మహావీరులైన దేశభక్తులను విడిపించి తరలించుకొని పోవాలని నెల్లూరు పరిసరాల విప్లవ పంథా కార్యకర్తలు వ్యూహరచన చేశారు. కాని ఆ వ్యూహం విఫలమైంది.

నెల్లూరు సంస్కృత కళాశాల పాలకవర్గంలో కొందరి ప్రముఖుల ప్రాపకత్వం, రామచంద్ర స్వాతంత్ర్యోద్యమ అభిరతి సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌కు రామచంద్ర పట్ల వైముఖ్యానికి కారణమైనాయి. అందువల్ల ఆయన విద్యా సంవత్సరానికి భంగం ఏర్పడింది. కాబట్టి రామచంద్ర నెల్లూరు విడిచి పెట్టి మద్రాసు వెళ్లి అక్కడి వేద సంస్కృత కళాశాలలో తమ సాహిత్య శిరోమణి కోర్సు పూర్తి చేసుకోవటానికి అక్కడి పాలకవర్గం పెద్దల సాయంతో ఆ కళాశాలలో ప్రవేశించారు. అదృష్టవశాత్తు ఆయనకక్కడ తిరుపతి కళాశాల సహాధ్యాయులు కూడా కొందరు తారసపడ్డారు. అయితే ఆయన వెనుక గూఢచారి విభాగం కనిపెట్టి ఉన్నదని ఆయనకు తెలియదు. పోలీసు వారు ఆయనను మద్రాసు కుట్ర కేసులో నిందితుడుగా అభియోగం మోపి 'నిగా'లో ఉంచారు. అందువల్ల కళాశాలలో ఆయన చదువు సాగించే అవకాశం రద్దైపోయింది. ఈ మద్రాసు కుట్ర కేసు నీడలో ఆయన బంధువులకు, మిత్రులకు అందరికీ పరిత్యక్తుడై ఒక సంవత్సర కాలం గడపవలసి వచ్చింది. ఈ విధంగా రెండు-మూడేళ్లు ఆయన జీవితంలో అతిముఖ్యమైన యౌవనకాలంలో నిరాధారంగా సంఘర్షించవలసి వచ్చింది. అయితే ఆయన ఎన్నడూ దైన్యంలో కూరుకొని పోలేదు.

తిరుచిరాపల్లి జైలులో ఉన్న కాలంలో ఆయన 'సత్యాగ్రహ విజయః' అని ఒక గేయరూపకం రచించారు. అందులో ఉద్యమ నాయకుడు ఎన్ని కష్టాలనుభవించినా, చివరకు ప్రాణత్యాగం చేసినా, ఆ త్యాగం దేశ స్వాతంత్ర్యాన్ని ఎట్లా ఉద్దీపింప చేసిందో భరత వాక్యంగా సంధించాననీ అందువల్ల నాయకుడు మరణించినా తన కావ్యం సుఖాంత కావ్యమేనని వ్యాఖ్యానించారు. స్వాతంత్ర్యోద్యమం పట్ల రామచంద్ర గాఢమైన అంకితభావం అటువంటిది.

నిజానికి రామచంద్ర వంటి త్యాగధనుల వల్లనే భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది.

# 6. సాహిత్యప్రస్థానం

ఆయన జీవితకాలంలో తిరుమల రామచంద్ర సాహిత్య ప్రస్థానం అరవై సంవత్సరాలు విస్తరించుకొని ఉంది. ఇరవైయవ శతాబ్దపు సృజనాత్మక మహా ప్రతిభా శీలురైన రచయితలలో ఏ ప్రక్రియ పరంగా ఆయనను అగ్రశ్రేణి రచయితగా పరిగణించాలి ? పరిగణించవచ్చునేది ఒక ప్రశ్న. గొప్ప కథారచయితగా గాని, నవలా రచయితగా గాని, నాటక రచయితగా కాని, గొప్ప కవిగాకాని, విమర్శ ప్రస్థానాచార్యుడుగా కాని వారిని పరిగణించే అవకాశం లేదు. వ్యాసరచయితగా రామచంద్రకు సముచిత స్థానమున్నది. బహుశా రామచంద్ర రాసినన్ని వ్యాసాలు 20వ శతాబ్ది తెలుగు రచయితలలో మరెవరూ రాసి ఉండరు. ఆయన పుస్తక సమీక్షలు కూడా వ్యాసాల వంటివే. వారి సాహితీ వ్యాసంగంలో 12 పైనే కలం పేర్లతో వారు వివిధ విషయాలపై రచనలు చేసినట్లు వారే ఒక చోట చెప్పారు. వివిధ విషయాలపై ఆయన రాసిన వ్యాసాలు, చేసిన పుస్తక సమీక్షలు కలిసి సహస్రాధికంగా ఉన్నాయి.

ఆంధ్రప్రభ దినపత్రికలో వారు పనిచేస్తున్నప్పుడు గొప్ప పత్రికా రచయిత ఉత్తమోత్తమ ప్రతిభ ప్రమాణం, ఒక గంటలో ఒక 'కాలమ్' రాయగలిగి ఉండటం అని 'నార్ల' వారు అనేవారుట. నార్ల వేంకటేశ్వరరావు 20వ శతాబ్దపు తెలుగు పత్రికా సంపాదకులలో చాలా పేరు ప్రతిష్ఠలున్న వారు. వారితో రామచంద్ర పది సంవత్సరాలు పైనే పని చేశారు. రామచంద్ర పని చేయని తెలుగు దినపత్రిక లేదా ఆయన రచన ప్రకటించని తెలుగు దిన, వార, మాస పత్రిక ఒక అర్ధ శతాబ్ద కాలంలో లేదనడం అతిశయోక్తి కాదు. తెలుగు పత్రికా చరిత్రలో ఆయన నిర్వహించిన, నియత శీర్షికా రచనలు ('ఫీచర్స్') ఎవరూ నిర్వహించలేదు. వారి నియత శీర్షిక రచనలు తరవాత పుస్తకాలుగా కూడా వచ్చాయి. పేరు తెచ్చుకున్నాయి. పాఠకులు ఆసక్తితో చదివారు. అవి పత్రికలలో వస్తున్నప్పుడు చదువరులు ఉత్సుకతతో ఎదురుచూస్తూ ఉండేవారు.

రామచంద్ర మొట్టమొదటి రచన భారతిలో అచ్చైంది. అది 1935వ సంవత్సరం. అత్యంత విశిష్టమైన తెలుగు సాహిత్య మాసపత్రిక భారతి. అరవై సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా వచ్చింది. ఆ తరవాత ఆగిపోయింది. భారతి వంటి తెలుగు సాహిత్య మాసపత్రిక అంతకుముందు కాని, అటు తరువాత కాని రాలేదు. భారతిలో రచన రావడమంటే సాహిత్యపరంగా గొప్ప గుర్తింపు వచ్చినట్లు.

అటువంటిది రామచంద్ర మొదటి రచనే భారతిలో వచ్చింది. వేటూరి ప్రభాకరశాస్త్రి గిడుగు రామమూర్తి వంటి ఆ నాటి గొప్ప పండితులు, అగ్రశ్రేణి సాహిత్యపరులు ఆ రచనను గుర్తించారు. ప్రభాకరశాస్త్రి గారింట్లో రామమూర్తి పంతులు గారు రామచంద్రను మొదటిసారి చూసినప్పుడు శాస్త్రిగారు 'ఈ నెల భారతిలో తెలుగు ఛందోవిశేషాలు' గూర్చి రాసిన రచయిత ఇతడేనని రామచంద్రను పరిచయం చేసినప్పుడు రామమూర్తి పంతులుగారు ఆశ్చర్యపడి 'ఎవరో పెద్ద శాలువా పండితుడై ఉంటారనుకొన్నాను' అన్నారట. అప్పటికి రామచంద్రకు ఇరవై రెండేళ్ల వయస్సే. రామచంద్ర రెండో రచన కూడా భారతిలోనే వచ్చింది. కొన్ని తెలుగు పదాల స్వరూపం గూర్చిన చర్చ అది. ఆ తర్వాత ఆయన ఐదారేళ్లు ఏ రచనా చేయలేదు. ఆ రోజుల్లో ఉపాధ్యాయ వృత్తికి ఉపకరించే విద్వాన్ పరీక్షలో కృతార్థుడు కావడం, తాటాకు ప్రతుల నుంచి కోరిన వారికి ప్రతులు రాసిపెట్టడం, గ్రంథ పరిష్కరణలో పెద్ద వారికి సాయపడటం మొదలైన పనులలో ఆ ఐదేళ్లు గడిపారు. కాబట్టి రచనలు చేయాలన్న ఆసక్తి ఆయనకు కలిగి ఉండదు.

సుమారు నాలుగు సంవత్సరాలు రామచంద్ర 'ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ'లో వ్రాతప్రతులు కాగితాలపై ఎత్తిరాసే పనిలో జీవిక నిర్వహించుకొన్నారు. ఒక్కొక్క శ్లోకంలో 32 అక్షరాలుండే వంద శ్లోకాలు ఎత్తిరాసే పనికి 5 రూపాయలు ప్రతిఫలం లభించేదట. పని ఎంత ఉన్నప్పటికీ ఆర్జనపై దృష్టి నిమగ్నం చేయలేదాయన ఎప్పుడూ. నెలకు 15, 16 రూపాయలు లభిస్తే చాలునని తృప్తి పడేవాడినని ఆయనే చెప్పుకున్నారు. ఆ రాబడితో నెల అంతా ఇంటి అద్దె, భోజనం ఖర్చుతో సహా నిర్విచారంగా గడిచిపోయేది ఆ కాలంలో అని కూడా ఆయన స్వీయ రచనలో ప్రసక్తం చేశారు.

చెన్నపట్నంలోని మాన్యుస్క్రిప్ట్స్ ఓరియంటల్ లైబ్రరీ అనే ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం ఆగ్నేసియాలో కెల్లా అగ్రగణ్యమైనది. భారతదేశంలోని ప్రధాన భాషల లిపులతో అక్కడ తాళపత్ర గ్రంథాలుండేవి. అరబీ, ఫారసీ, ఉర్దూల తాళపత్ర గ్రంథాలు కూడా ఉండేవని రామచంద్ర రాశారు. తాళపత్ర గ్రంథాలే కాక ముప్పై వేల వరకు అచ్చు పుస్తకాలు కూడా ఉండేవట. ఆఫీసు వేళల్లో ఏ రెండు-మూడు గంటలలో జీవిక కోసం పని చేసి తక్కిన కాలమంతా 'ఆబ'గా వివిధ విజ్ఞాన సంబంధమైన పుస్తకాలు చదివేవాడినని రామచంద్ర రాసుకున్నారు. అందువల్లనే ఆయన మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గారి వంటి గొప్ప సాహిత్యవేత్తలతో, మహాపండితులతో పని చేయగలిగారు వారి సహాయకోద్యోగిగా. పురాచరిత్ర, శాసన పరిశోధన, గ్రంథపరిష్కరణం, శబ్ద వ్యుత్పత్తి, సాహిత్య భాషల తులనాత్మక పరిజ్ఞానం, పరిశోధన పద్ధతులలో ప్రజ్ఞ సంపాదించగలిగారు. ప్రపంచ దేశాల ప్రాచీన నాగరికతల గూర్చి కూలంకషమైన అధ్యయనం సాగించ గలిగారు.

ప్రభావశీలమైన నిండు యౌవనమంతా ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఆయన పని చేయడం వల్లనే ప్రాకృత సంస్కృత భాషాసాహిత్యాలలో గొప్ప పాండిత్యం సముపార్జించడం వల్లనే తన 30 ఏళ్ల వయసుననే డా. రఘువీర వంటి మహాపండితుణ్ని ఆయన ఆకర్షించగలిగారు. అందువల్లనే డా. రఘువీర ఆయనను తనతో కలిసి ప్రపంచ భాషా నిఘంటు నిర్మాణంలో తోడుపడవలసిందిగా అర్థించారు. లాహోర్‌లోని పంజాబ్ విశ్వవిద్యాలయంలో సంరక్షితమైన రెండువేల ప్రాచీన తాళపత్ర గ్రంథ వివరణాత్మక సూచీకరణ నిమిత్తం ఆయన ఉద్యోగ నియామకం జరిగినప్పుడు రామచంద్ర వయస్సు పాతికేళ్లు. అప్పుడే ఆయన మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ వంటి, కె.పి. జయస్వాల్ వంటి గొప్ప సాహిత్య, సాంస్కృతిక, పురాభారతీయ విజ్ఞానవేత్తలతో సహసంభాషణలు చేశారు.

లాహోర్‌లోని పంజాబు విశ్వవిద్యాలయంలో లిఖిత గ్రంథాల సూచీకరణం సాగుతూ ఉండగా ఆయన హిందీలో 'సాహిత్యరత్న', 'ప్రభాకర' వంటి డిగ్రీలు సంపాదించారు. ప్రసిద్ధ హిందీ రచయితలందరితో పరిచయాలేర్పరచుకొన్నారు. కొన్ని నెలలపాటు లాహోర్‌లో ఒక స్కూల్లో హిందీ ఉపాధ్యాయుడుగా కూడా పని చేశారు. అయితే ఉపాధ్యాయ వృత్తి ఆయనకు రుచించలేదు. ఇంతలో రెండో ప్రపంచయుద్ధం వచ్చింది. ఎవరికీ చెప్పాపెట్టకుండా, ఎవరి సలహా తీసుకోకుండా ఎవరి సహాయం ఆశించకుండా వెళ్లి సైన్యంలో చేరిపోయారు. లాహోర్‌లో ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో పనిచేస్తున్నప్పుడూ, అటు తరువాత క్వెట్టాలో హవల్దార్ క్లర్క్‌గా పనిచేస్తున్నప్పుడు కూడా గ్రంథాలయాలలో ఎక్కువగా గడిపేవారు. ఎన్నో పుస్తకాలు చదివారు. అయితే ఆంధ్రదేశానికి దూరంగా ఉన్నందువల్లనూ, తమ పనిలో తీరిక లేనందు వల్లనూ, విజ్ఞాన సముపార్జనంలో ఎక్కువ ఆసక్తితో గ్రంథ పఠనంలోనే నిమగ్నమైనందు వల్లనూ ఆయనకు రచన చేయాలన్న ఉత్సుకత జనించి ఉండదు.

మిలిటరీ ఉద్యోగానికి స్వస్తి చెప్పిన తర్వాత జీవనోపాధికోసం వివిధ వృత్తులతో ప్రయోగాలు చేసినా జీవిక కోసం పత్రికా రచనను స్వీకరించడానికి ఆయన నిర్ణయించుకున్నారు కాబట్టి లాహోర్ నుంచి రాగానే ఏదైనా తెలుగు పత్రికలో ప్రవేశించడానికి ఆయన నిర్ణయించుకున్నారు. ఆ ప్రయత్నంలోనే హైదరాబాద్ వచ్చారు. యాదృచ్ఛికంగా అక్కడ రామచంద్రకు పత్రికలో పని చేసే అవకాశం లభించింది. అడవి బాపిరాజు గారి సంపాదకత్వంలో అప్పట్లో హైదరాబాద్ నుంచి వెలువడిన మీజాన్ పత్రికలో రామచంద్ర సుమారు రెండు-మూడేళ్లు పనిచేయడం ఆ వృత్తిలో ఆయన భవిష్యత్తులో ఎంతగానో రాణించడానికి దోహదం చేసింది. 'శుభారంభం సగం సాఫల్యసిద్ధి' అనే పెద్దల మాటలకు నిదర్శనంగా రామచంద్ర భవిష్యజ్జీవన పత్రికారంగ సాఫల్యానికి బాపిరాజు గారి ఒరవడి ఎంతగానో

అనుకూలించింది. పురానాగరకత, చరిత్ర, సంస్కృతి, మతం, భాషోత్పత్తి, లిపి, ఆలయ వాస్తు నిర్మాణం మొదలైన వాటిలో రామచంద్ర గాఢమైన అభిరుచికి బాపిరాజు గారి మనీషత ప్రేరకమై ఉంటుంది. మీజాన్ పత్రికలో తాను పని చేస్తున్నప్పుడు తన సైనిక జీవితానుభవాలు కథలుగా రాశానని రామచంద్ర చెప్పుకున్నారు. పత్రికా రచయితగా ఆయన రోజూ ఏదో రాయడమో లేదా ఇతరుల రచనలను ప్రచురింప చేయడమో చేయాల్సి ఉండేది. ఆళ్ల పిచ్చయ్య అని ఒక చప్రాసీ రాసిన ఆత్మకథను తాను శ్రద్ధ తీసుకొని మీజాన్ పత్రికలో ప్రకటించినట్లు రామచంద్ర రాశారు. మీజాన్ పత్రికలో పని చేసిన నాటి తన అనుభవాలు చాలా ప్రస్తావనలలో రామచంద్ర ఉత్తేజకరంగా స్మరించేవారు. బాపిరాజు గారు తనను పత్రికా రచయితగా శిల్పీకరించినట్లు రామచంద్ర విశ్వాసం. తనను ఒక నవలలో కొంతవరకు ఒక పాత్రగా కూడా బాపిరాజుగారు ఉపయోగించుకున్నారని రామచంద్ర కథనం.

రామచంద్ర అటు తర్వాత ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రభూమి పత్రికలలో పని చేసినప్పుడు హైదరాబాద్ లేఖ, హైదరాబాద్ నోట్‌బుక్, నుడి–నానుడి, పలుకుబడి, సాహితీ సుగతుని స్వగతం వంటి శీర్షికలు నిర్వహించారు. మరపురాని మనీషి, తెలుగు వెలుగు వంటి లేఖినీ చిత్రాలు ప్రకటించారు.

రామచంద్ర చివరి రచన తెలుగులో వ్యాసప్రక్రియ ఉద్భవ వికాస పరిణామాల గూర్చి రాసినది. ఆయన పరమపదించిన మూడు నెలల తర్వాత ఇది ఒక ప్రత్యేక సంచికలో ప్రచురితమైంది. రామచంద్రకు కన్నడం కూడా బాగా వచ్చు కాబట్టి, తమిళంతో తగినంత పరిచయం ఉంది కాబట్టి సాహిత్య అకాదెమీ వారికి తమిళ, మలయాళ, కన్నడాల నుంచి అనువాదాలు నిర్వహించారు. ప్రాకృత సాహిత్యం పట్ల ఆయనకు ప్రత్యేక శ్రద్ధాసక్తులుండేవి. ప్రాకృత భాషా సాహిత్య పాండిత్యాన్ని ప్రోత్సహించే నిమిత్తం ప్రాకృత అకాదెమీ అనే ప్రచురణ సంస్థను కూడా వారు స్థాపించారు. హాలచక్రవర్తి సంకలిత గాథాసప్తశతి విశేషాలను గూర్చి ఆయన రెండు గ్రంథాలే రాశారు.

నాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదెమీ రామచంద్ర రచనలకు రెండుసార్లు పురస్కారం ప్రకటించింది. పది సంవత్సరాల వ్యవధానంలో ఈ విధంగా రెండు సార్లు పురస్కృతుడైన రచయిత తెలుగులో ఇంకొకరు లేరు. 20వ శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్రలో బౌద్ధ–జైన వాఙ్మయాల గురించి విశిష్ట కృషి చేసిన నలుగురైదుగురు రచయితలలో రామచంద్ర పేరును తప్పక సంస్మరించుకోవాలి.

1935 నుంచి 1997 వరకు అంటే 62 సం॥లు రామచంద్ర రచనలు వివిధ తెలుగు పత్రికలలో సహస్రాధికంగా వచ్చాయి. స్వాతంత్ర్యానంతర కాలాన వెలువడిన ఎన్నో విశిష్ట అభినందన సంచికలలో ఆయన రచన తప్పక కనపడుతుంది.

# 7. రామచంద్ర విశిష్టవ్యక్తిత్వం

పసి వయస్సు నుంచీ రామచంద్ర గ్రహణ ధారణ శక్తులు విశిష్టమైనవి. ఆయన జ్ఞాపకశక్తి అపారం. పరిశీలనాసక్తి అమేయం. మూడేళ్ల వయసుననే ఆయనతో తల్లిగారు దైవస్తుతులు, స్తోత్రాలు వల్లింపచేశారు. ఎనభై ఏళ్ల వయసున కూడా రామచంద్ర ప్రతి రోజూ ఉదయం స్నానం చేసిన తర్వాత నిత్య స్తోత్ర పారాయణం చేసేవారు. అవన్నీవైష్ణవ ప్రపత్తికి సంబంధించిన స్తోత్రాలే. ధర్మవరం కృష్ణమాచార్యుల వారు తిరుమల వారికి బంధువులు. కృష్ణమాచార్యుల వారి కుమారుడికి రామచంద్ర తండ్రిగారు తోడల్లుడే. రామచంద్ర తల్లిగారి తోబుట్టువులు ఆరుగురిలో జానకమ్మ గారు మూడో ఆమె. ఆమెకిద్దరు అక్కలు, ముగ్గురు చెల్లెళ్లు, ఒక తమ్ముడున్నూ. ఈ అందరి సంతానంలో మొట్టమొదటి మగసంతానం రామచంద్రే. అందువల్ల ఆరుగురు తల్లుల ముద్దుమురిపాల మధ్య రామచంద్ర శైశవబాల్యాలు గారాబంగా గడిచాయి.

మూడేళ్ల వయసున జరిగిన సంఘటనలు కూడా ఆయనకు జ్ఞాపకం ఉన్నాయి. తమ మేనమామ గారి ఊరైన రాగంపల్లి నుంచి ధర్మవరం మూడు-నాలుగు మైళ్ల దూరం. అక్కడ ధర్మవరం వారి చిత్రనళీయం నాటక ప్రదర్శనకు కుటుంబమంతా ఎడ్లబండ్లపై వెళ్లారు. నాటకం చూసి ఇంటికి తిరిగి వస్తుండగా ఆ ఎడ్లబండి కిందుమీదై పోయింది. ప్రమాదం సంభవించలేదు కాని గాయాలు తగిలాయి. ఈ విషయం రామచంద్ర పూసగుచ్చినట్లు స్వీయచరిత్రలో వివరించారు. అంతేకాక చిత్రనళీయం నాటకంలోని ఒక కీర్తన కూడా ఆయనకు గుర్తుంది. పసి వయసున ఆ కీర్తన చరణాలు తాను తబ్బిబ్బుగా పాడటం, అందరూ నవ్వటం కూడా ఆయన గుర్తు చేసుకున్నారు. చల్లా సుబ్బారాయుడనే వీధిబడి పంతులు తనకు అమరం, ఆంధ్రనామ సంగ్రహం నోటిపాఠం చెప్పటం కూడా రామచంద్రకు గుర్తుంది.

మాతామహ స్థానం నుంచి ఆయన మూడేళ్ల వయసున కమలాపురానికి వెళ్లి అక్కడ 5వ ఏట వీధి బడిలో చేరి నాలుగో తరగతి దాకా చదివారు. బడి మొదలుకాగానే ప్రతిరోజూ పిల్లలు కన్నడంలోనూ, ఇంగ్లీషులోనూ చేసే దైవప్రార్థన, రాజభక్తిగీతమూ ఆయనకు గుర్తున్నాయి. వారు చదివిన వాచకపుస్తకాల గూర్చి స్వీయచరిత్రలో వారు ఉటంకించారు.

కమలాపురంలో వారి వీధిలోనే ఎదురింట్లో బసివి నాగమ్మ ఉండేది.

ఆమె ఒంటరిగా ఎలా ఎందుకు ఉంటుందనీ, ఎవరూ ఆమెను పండుగ పబ్బాలకు పేరంటాలకు ఎందుకు పిలవరని ఆయనకు జిజ్ఞాస కలిగేది. అప్పుడాయన వయసు ఆరేళ్లే. ఆ వైనం తల్లినడిగినా ఆమె చెప్పింది తనకర్థం కాలేదు. నాగమ్మ తన పట్ల ఎంతో ఆపేక్షకనపరచేది. బడికి వెళ్లేప్పుడు, తిరిగి వచ్చేప్పుడు ఎప్పుడైనా పండ్లు, మిఠాయిలు ఇస్తుండేది. ఒకరోజు ఆమె రామచంద్రను నాగులచవితి సంబరాలకు ఊరిబయట ఉయ్యాలలూగటానికి తనతో తీసుకొని వెళ్లింది. మళ్లీ ఇంటికి తిరిగి వచ్చే సంజవేళ బండిలో రామచంద్ర ఆమె ఎందుకు వొంటరిగా ఉంటుందో, ఎవరూ ఆమెను ఇళ్లకు ఎందుకు పిలవరో తెలుసుకోగోరాడు. ఈ విధంగా రామచంద్రకు అతిచిన్న వయసు నుంచే సమాజ పరిశీలనాసక్తి ఉండేది. తన తల్లి తర్వాత స్త్రీల పట్ల పూజ్యభావాన్ని స్థిరపరచిన మహిళ నాగమ్మే అని రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పారు. కమలాపురంలో తమ ఇంట్లో సేద్యపు పనులు, ఇంటి పనులు చేసే గిరిజన పరిచారకుల వృత్తాంతం కూడా రామచంద్ర స్వీయచరిత్రలో ప్రసక్తం చేశారు.

రామచంద్ర తాతగారైన నరసింహాచార్యుల వారికి కమలాపురం చుట్టు పట్ల ఊళ్లో శిష్యులుండే వారు. శ్రీవైష్ణవ గురుశిష్య సంప్రదాయం ప్రకారం ప్రతి సంవత్సరం ఆచార్యులు ఆయా శిష్యుల ఊళ్లకు వెళ్లి వాళ్లకు బోధ చేస్తారు. ఈ విధంగా 'నారాయణకెరె' అనే ఊరికి తాతగారు పోతూ ఉండగా రామచంద్ర కూడా అనుసరించారు. అప్పుడు రామచంద్రకు ఐదారేళ్ల వయసే. రాత్రి పూట మసక వెన్నెట్లో ప్రయాణంలో ఒక పులి వీరి బండికి అడ్డు వచ్చింది. అది మార్గమధ్యంలో విశ్రాంతిగా హాయిననుభవిస్తోంది. ప్రాణభయంతో ఎద్లు అర్ధచంద్రాకారంగా పులితో మోహరించడం, ఆ పులిగర్జనలు ఎంతో వివరంగా స్వీయచరిత్రలో వర్ణించారు రామచంద్ర.

తుంగభద్ర తీరంలో హంపీ కోదండ రామస్వామి ఆలయంలో ముచ్చుకుంట శేషాచార్యుల వారి వద్ద ఎనిమిదేళ్ల వయసున తాను భయం భయంతో సంస్కృతం ఎట్లా అభ్యసించిందీ క్రూరమృగాల సంచార పరిసరాలలో ఒంటరిగా ఎలా గడిపిందీ రామచంద్ర వర్ణించారు. ఇక ప్రసక్తానుప్రసక్తంగా హంపీ విజయనగర శిథిల వైభవ స్మృతులను, అక్కడి శిల్పాలను, పరంపరగా చెప్పుకుంటున్న కథలను ఎంతో భావుకంగా వివరించారు.

జ్ఞానసముపార్జన పట్ల ఉన్న అభినివేశం, అభిరుచి ఆయనకు ధన సంపాదన పట్ల, లౌకిక ప్రయోజనాల పట్ల ఎప్పుడూ ఉండేదికాదు. ఒక మంచి పుస్తకం చదివినప్పుడు ఆయనకు కలిగే ఆనందం, మిత్రులతో సాహిత్య గోష్ఠిలో కలిగే సంతోషం, ఏ రచన వల్ల వచ్చే ప్రతిఫలమో, ప్రశంసకన్నా ఎక్కువగా భావించే వారాయన. రోజువారీ జీవితంలో కనీస సౌకర్యాల పట్ల అంటే స్నానపానాలు, వేళకు భోజనం, నిద్రా సౌఖ్యం కూడా రామచంద్ర ఏ మాత్రం పట్టించుకునే వారు

కారు. పెద్ద వయసు వచ్చిన తర్వాత కూడా ఆహార వేళలాయన పాటించేవారు కాదు. సర్వసాధారణంగా ఆయన నడకనే ఎక్కువగా ఇష్టపడేవారు. రేపటి సంగతి ఏమిటి ? అని ఆయన కష్టపడుతున్నా నిబ్బరంగా ఉండేవారు కాని బాధపడేవారు కాదు. ఎవరి దగ్గరైనా ఏదైనా తొందర అవసరానికి డబ్బు తీసుకుంటే వీలైనంత త్వరలో ఆ బాకీ తీర్చివేస్తూ ఉండేవారు. ఆయనలో ఎప్పుడూ శిశుసారళ్య ప్రవృత్తి వ్యక్తమవుతూ ఉండేది. రేపటి మాట ఏమిటి ? అని శిశువులు జాగ్రత్త పడరు కదా !

మద్రాసు ప్రాచ్య లిఖిత భాండారంలో రెండు సంవత్సరాలు పని చేసినప్పుడు వారానికి 20 రూపాయలు ఆర్జించుకోగలిగిన అవకాశాలలో కూడా నెలకు 15, 16 రూపాయలు చాలును అనుకొని తన కాలం జ్ఞాన విస్తరణకే వినియోగించారాయన. రామచంద్ర సాధుప్రవృత్తిని, నిష్కాపట్యాన్ని, అలౌకిక ప్రవృత్తిని కొందరు స్వప్రయోజనానికి, స్వార్థ ప్రయోజనానికి, స్వార్థలాభానికి వినియోగించుకున్నారు. అయినా ఆయన బాధ పడలేదు. వారి పట్ల వైమనస్యం చూపలేదు. లోకం పోకడను గర్హించలేదు.

మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో పని చేస్తున్నప్పుడు ప్రతిఫలాపేక్ష చూడకుండా కొందరికి ఉపకరించానని రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పారు. 'ప్రతిఫలం కోరడం, ఆ వ్యక్తి ఇస్తానని ఎగగొట్టడం, దానితో కష్టపడడం ఎందుకని ? ప్రతిఫలం ఆశించకుండానే పనిచేసే వాడిని' అని చెప్పుకున్నారాయన. తమపై అధికారి అయిన ప్రభాకరశాస్త్రిగారి సిఫార్సుతో నలుగురైదుగురికి రాత ప్రతులు నకలు చేసి ఇవ్వడం, వాళ్లు ఇస్తామన్న ప్రతిఫలం ఇవ్వకపోవడం, శాస్త్రి గారు తమ మాట పోయిందని కష్టపడటం జరిగిందని కూడా రామచంద్ర రాశారు. విజయనగరం కళాశాలలో పని చేసే సీతారామయ్య అనే వారు గంగవంశరాజులపై పరిశోధన చేస్తూ తాళపత్ర పుస్తక భాండాగారానికి వచ్చారు. ఈ గ్రంథ భాండాగారంలో గంగవంశావళి అనే పుస్తకం ఉంది. అది సంస్కృతంలో ఉంది. దానికి నకలూ, అనువాదమూ కూడా కావాలని ఆ సీతారామయ్యగారు శాస్త్రి గారినర్థించారు. శాస్త్రిగారు నియమనిబంధనల మేరకు చెల్లించవలసిన మూల్యం తెలిపారు. రాతకోతలెందుకు, పూర్తికాగానే ఇస్తానని ఆయన అన్నారు. శాస్త్రి గారు నమ్మారు. రామచంద్ర ఆ పని చేశారు. ఆ పరిశోధకుడు ఆ గాంగవంశావళిని తానే కనుక్కొని పరిష్కరించి ప్రకటించినట్లు, అనుబంధంలో రామచంద్ర చేసిన అనువాదంతో సహా ప్రకటించుకున్నాడు. ఇటువంటిదే మరొక సంఘటన కూడా జరిగింది. తిరుపతి నుంచి ప్రతివాది భయంకరాచార్యులనే వారు వచ్చి నిత్యానాథుడి రసరత్నాకరంలో ఒక అధ్యాయం రామచంద్రచే నకలు చేయించుకొని తిరుపతి వెళ్లగానే డబ్బు పంపుతానని చెప్పి మోసగించారు. ప్రభాకరశాస్త్రి గారు ఆ తర్వాత ఆ సీతారామయ్య, ప్రతివాది భయంకరులూ ఎప్పుడైనా కన్పించారా అని వేళాకోళమాడే వారని రామచంద్ర

స్వీయచరిత్రలో రాశారు. ఈ సంఘటనలను ఇట్లా వ్యాఖ్యానించారు రామచంద్ర. 'నేను ఎవరితోనన్నా స్నేహం చేస్తాను. ఎదుటి వారు మోసం చేశారూ, నాకు పోయేదేమీ లేదని నా విశ్వాసం. ఉపకారం జరిగిందా' సరే - నన్నారాయన. తమకు న్యాయసమ్మతంగా ముట్టవలసిన దానిని కూడా, ఆయన ఉపకారంగానే భావించుకునే వారన్నమాట. అదీ ఆయన మనస్విత ! మనకు పరిచయమైన ప్రతివాడూ మంచి వాడని రుజువు ఽ వడానికి ఏండ్లు పూండ్లు పడతాయి. మనకు మనశ్శాంతి ఉండదు శంకిస్తూ పోతే. అందువల్ల నమ్మడం మంచిదంటారు రామచంద్ర. 'మానవుడు మంచిచెడ్డల కలయిక. మంచిని చూడడం అలవరుచుకుంటే మనకు ఎంతో హాయి, చెడు చూచి మన మనసు చెడుపుకోవడం ఎందుకు ?' అంటూ తమ సుదీర్ఘమైన పత్రికారంగ జీవన ప్రవృత్తిలో సామాన్యుల గూర్చీ, అసామాన్యుల గూర్చీ వారిలో మంచినే వివరించానన్నారు రామచంద్ర. 'ఒకరికి ఉపకారం చేయటం మంచి పని. మానసికసంతోషానికి దారి. కాని ఎప్పుడూ కూడా ఎవరి నుంచీ ఏదీ ఆశించవద్దు. అలా ఆశించడం వల్లనే కదా నిరాశ కలిగేదిః దానివల్లే కదా అసంతృప్తి పెరిగేది ? అందువల్ల చేయడం నీ వంతు. ఫలితాన్ని ఆశించకు. దానికి ఫలితం నీకు ఇంకెక్కడో మరెవరి ద్వారానో కలుగుతుంది. కాని అలా కలుగుతుందని కూడా ఆశించవద్దు. 'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' అనేది గుర్తుంచుకోవాలి. నిరాశ కలిగించుకునేది మనమే. దాన్ని కలుగనీయకుండా చేసుకునే నేర్పును సంపాదించాలి' అనేది రామచంద్ర జీవన సిద్ధాంతం. ఇది భగవద్గీతా పరమార్థ సారాంశం.

సైన్యంలో హవల్దార్ గుమస్తాగా పని చేస్తున్నప్పుడు బతికి చెడ్డ అచ్చర్‌సింగ్ అనే మిలిటరీ కాంట్రాక్టరుకు మూడు రోజులకో నాలుగు రోజులకో భుక్తి గడవడానికి సాయపడి రామచంద్ర కోర్టు మార్షల్‌కు గురి అయినప్పుడూ, అచ్చర్‌సింగ్ కోసమే దుఃఖించాడు కాని తనకెంత ఘోర శిక్ష పడుతుందోనని సంతాపించలేదు. శిక్ష పడి ఉంటే రామచంద్ర జీవితం సర్వనాశనమయిపోయేది. లాహోర్ నుంచి క్వెట్టాకు రైలు ప్రయాణం చేస్తున్న సందర్భంలో తన బోగీలోనే ప్రయాణిస్తున్న రామేశ్వర దయాళ్ గౌడ్ అనే రైల్వే ఉద్యోగితో పరిచయమైంది రామచంద్రకు. తాను కట్టుకున్న జరీ పంచలను చూసి వాళ్ల పిల్లలు అల్లరి చేస్తుండగా వాళ్లకు తన జరీ ఉత్తరీయాలు బహూకరించడం, ఆ తర్వాత ఆ కుటుంబంతో మమేకమైపోవడం స్వీయచరిత్రలో ప్రసక్తం చేశారు రామచంద్ర. మానవత్వం పట్ల పరిపూర్ణమైన నమ్మకమూ, కష్ట సహిష్ణుత, జీవన వైచిత్రి గవేషణ తత్పరత ఆయన జీవితాన్ని నడిపించాయి. ఆయనది ఉత్తమమైన విశిష్ట వ్యక్తిత్వం.

# 8. కుటుంబజీవితం

తిరుమల రామచంద్ర జీవనయానంలో అన్నీ అసాధారణ సంఘటనలే. ఆయనకు ఊహ తెలిసినప్పటి నుంచీ ఎదురైనవి విచిత్రోదంతాలే. వైవాహిక జీవితంలోకి ఆయన ప్రవేశించడంలోనూ కొంత వైచిత్రి ఉన్నది. సాధారణంగా నూటికి తొంభైమంది జీవితాలలో వాళ్లు పురుషులైనా, స్త్రీలైనా ఇటువంటి సన్నివేశాలు చోటు చేసుకొని ఉండవు. ఆయన జీవితంలోని అనేకానేక సంఘటనల మాదిరిగానే ఆయన వైవాహిక జీవితంలో ప్రవేశించటం కూడా విలక్షణమే. ఏవో కథలలోనూ, నవలలలోనూ మాత్రమే రామచంద్ర జీవిత సంఘటనల వంటివి తారసపడతాయి.

స్వాతంత్ర్యోద్యమంలో 20సం, ల వయసున ఆయన జైలుకు వెళ్లారు. 14, 15సం. ల వయసుననే తిరుపతి పట్టణ కాంగ్రెసు కార్యకర్తగా ఆ చిత్తూరు జిల్లాలో ఎన్నో ప్రాంతాలు పర్యటించారు. జైలు శిక్ష నుంచి విడుదలై వచ్చిన తర్వాత తిరుపతి సంస్కృత కళాశాల వారు రామచంద్రను కళాశాల నుంచి బహిష్కరించారు. అప్పుడాయన అతి కష్టం మీద నెల్లూరు సంస్కృత వేద కళాశాలలో ప్రవేశం సంపాదించి చదువు కొనసాగించారు. వారాలు చేసి చదువుకున్నారు. ఇంతలో అవాంతరం రానేవచ్చింది. మద్రాసు కుట్ర కేసులో చిక్కుకున్నారు. అది అవాంతరగాథ.

నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో చదువుకుంటూ ఉండగా స్వాతంత్ర్య విప్లవ కార్యక్రమాలలో పాల్గొన్నారు. భగత్సింగ్‌ను బ్రిటిషు ప్రభుత్వం ఉరి తీసింది ఆ కాలంలోనే. భగత్సింగ్ అనుయాయులను అండమాన్ జైలుకు తరలిస్తున్నారని పత్రికలలో చదివి వారినెలాగైనా విడిపించాలని విప్లవసంఘమిత్రులు పథకం పన్నారు. కాని ఆ పథకం పారలేదు. అజ్ఞాతరహస్య కార్యకలాపాల ద్వారా బ్రిటిషు ప్రభుత్వాన్ని కూల్చివేయాలని నెల్లూరు మిత్రులతో జట్టీ కట్టారు. ఇదంతా పోలీసు నిగా యంత్రాంగం గమనిస్తూ సాక్ష్యసేకరణలో నిమగ్నమయ్యేఉంది.

అటువంటి ఘట్టంలో ఈయన వీరోచిత కార్యకలాపాలు, విద్వత్త, స్ఫురద్రూపం, అభ్యుదయభావాలు, త్యాగనిరతి, వాదకౌశలం, ధైర్యసాహసాలు, వినయం, చైతన్యశీలం చూసి బంధువర్గంలోని ఒక ముద్దరాలు ఈయనను ప్రేమించింది. ఆ ప్రేమను స్పష్టంగా వ్యక్తం చేసింది. తనను చేపట్టవలసిందని అర్థించింది. వాళ్లు శ్రీమంతులు. ఆ రోజుల్లోనే ఆమె ఆంగ్లమాధ్యంలో కాన్వెంట్ స్కూల్లో మెట్రిక్యులేషన్

పూర్తి చేసింది. ఆ యువతి తాతగారు బరోడా సంస్థానంలో దివాన్గిరీఫాయాలో పని చేశారు. ఆమె అందగత్తె. ఆమె తండ్రి గొప్ప ఉద్యోగం చేసి రిటైరైనారు. నెల్లూరు స్టోన్‌హౌస్ పేటలో వారికి మంచి ఇల్లుండేది. ఆ యువతి తండ్రిగారి పేరు అరావముదయ్యంగార్.

వీళ్లు రామచంద్రగారికి ఎట్లా బంధువులంటే రామచంద్రగారి పినతండ్రిగారైన శ్రీనివాస తాతాచార్యులవారి ప్రథమ కళత్రం పెత్తండ్రి ఈ అయ్యంగారు. ఆయన ఉద్యోగ విరమణానంతరం నెల్లూరులో స్థిరపడ్డారు. ఆమె పేరు కోమల. ఈ కోమల, బహుకోమల హృదయంతో తనను పెళ్లాడవలసిందిగా రామచంద్రను అర్థించింది. ఆమె తండ్రిగారు కూడా ఆమె సమక్షంలో ఈ ప్రస్తావన తెచ్చి తన తనయను వివాహం చేసుకోవలసిందిగా ఆయనను కోరారు.

వాళ్లది సంపన్నకుటుంబం. ఆమె విద్యావతి. లేతవయసు. తానా నిలుకడ లేని జీవితంలో పరిభ్రమిస్తున్నాడు. చదువు పూర్తి కాలేదు. విప్లవ కార్యక్రమాలలో పాల్గొంటున్నాడు. ఉద్యోగం ఆశ లేదు. దారం తెగిన గాలిపటంలా ఉంది తన స్థితి. భవిష్యత్తు అగమ్యగోచరం. తాను ఆమెకు తగను అనుకున్నాడు రామచంద్ర. ఆమె చిక్కులపాలు కావచ్చు. ఆమెను సుఖపెట్టగలిగిన తాహతు గాని, స్థితిగతులుకాని, జీవితధ్యేయం గాని తనకెక్కడివి ? అందువల్ల సున్నితంగా, విశాలోదారమనస్కతతో, నిండు హృదయంతో ఆమె ప్రేమను స్వీకరించలేదు రామచంద్ర. ఈ కథంతా ఆయన స్వీయచరిత్రలో ఎంతో హృదయావర్జకంగా ప్రసక్తం చేశారు. అటువంటి పరమసుశీలుడు, పరమమనోజ్ఞహృదయవాది, వేది శ్రీరామచంద్ర. ఈ కథ ఇలా అయిపోయిందా... మరి నాలుగేళ్ల తర్వాత ఆయనే ఒక ప్రేమకథలో చిక్కుకున్నారు. 1935 నుంచి మూడేళ్లపాటు రామచంద్ర చెన్నపట్నంలో ఉండి తన బతుకు నావ కొక చుక్కాని వెదుక్కొనే ప్రయత్నంలో ఉన్నారు. తాత్కాలికమైన ఉద్యోగాలు చేశారు. వివిధ వృత్తులలో ఉత్కంఠ కనపరచారు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ప్రతి విలేఖకుడిగా పనిచేశారు. ఆ సమయంలో తెలుగు, సంస్కృతాలతో విద్వాన్ పరీక్ష ప్రథమగణ్యతతో సాధించారు. వేటూరి ప్రభాకరశాస్త్రి గురుపాదులకు దగ్గరైనారు.

ఇంతలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు తెలుగుశాఖవారు ఆయనను తంజావూరు మహారాజా శరభోజి సరస్వతీమహల్ గ్రంథసంచయం నుంచి ద్విపద భారతం ప్రత్యంతరం రాసి తెమ్మని ఉద్యోగించారు. వారికి సహాయంగా కొమ్మనమంచి జోగయ్యశర్మగారనే సహోద్యోగిని కూడా పంపారు. తంజావూరులో శ్రీరామచంద్ర ఈ పనిలో సుమారు ఒక సంవత్సరం ఉన్నారు. ఈ పని పూర్తి అవుతూ ఉండగానే వెంటనే మద్రాసు వచ్చి శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారికి సహాయకుడుగా రంగనాథ రామాయణం ముద్రణయోగ్యప్రతి పరిష్కరణం నిర్వహించవలసిందని తంజావూరుకు తంతివార్త పంపారు ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు.

రామచంద్ర రోజూ గన్నవరపు వారింటికి వెళ్తూ ఆ పని చూడసాగారు. ఉదయం పది–పదిన్నరకు గన్నవరపు వారింటికి వెళ్లి సాయంకాలం ఐదు, ఐదున్నరదాకా ఆ పరిష్కరణలో పని చేసేవాడినని ఆయనే రాసుకున్నారు. సుబ్బరామయ్యగారికి ఆడపిల్లలు చాలామంది ఉన్నారు. ఆయన భార్య సుబ్బమ్మగారు రామచంద్రను ఆదరంగా చూసేవారు. సుబ్బరామయ్యగారి నాలుగో కూతురు ఆదిలక్ష్మిగారు, రామచంద్రతో చనువుగా ఉండేవారు. అనురూపమైన వయస్సు కాబట్టి వారి మధ్య అనురాగం కలిగింది, పెళ్లిచేసుకుందామని నిర్ణయించుకున్నారు. సుబ్బరామయ్యగారు వాళ్లు చింతాద్రిపేటలో ఉండేవారు. ఒక గది తీసుకొని రామచంద్ర ఎగ్మూరులో ఉండేవారు. ఇంతలో రామచంద్ర తండ్రిగారు శ్రీ శేషాచార్యులవారు ఒకసారి మద్రాసు వచ్చినప్పుడు వారిని రామచంద్ర గన్నవరపు వారింటికి తీసుకొని వెళ్లారు. అక్కడ ఆదిలక్ష్మిగారు తండ్రి కొడుకుల పట్ల కనపరచిన వినయ విశేష సంభ్రమం, విభ్రమం వల్ల, రామచంద్రగారి పట్ల చూపిన చనువువల్ల తమ కొడుకు ఆమెను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడని శేషాచార్యులవారు గ్రహించారు.

తండ్రీకొడుకులు మళ్లీ తమ వసతికి తిరిగి వస్తుండగా శేషాచార్యులవారు గన్నవరపు వారింటి ప్రస్తావన తెచ్చి ఈ సంబంధం తమకు ఇష్టం లేదని చెప్పారు. ఒకవేళ తామెలాగో సరిపెట్టుకున్నా, అమ్మ అంటే రామచంద్రతల్లిగారు సుతరామూ ఇష్టపడరని స్పష్టంచేశారు. తమ బంధువర్గంలో రత్నాలలాంటి పిల్లలున్నారనీ ఆ కుటుంబాల పెద్దలు వారు రామచంద్రను అల్లుడుగా చేసుకోవాలని ఆసక్తి చూపుతున్నారనీ కూడా రామచంద్రకు అనునయంగా, ఆపేక్షతో తెలిపారు. సంప్రదాయనిరతి గల కుటుంబంలో పెద్దకొడుకుగా పుట్టిన రామచంద్ర తల్లిదండ్రులను ఎలా కాదంటారు ? ఈ విధంగా ఈ ప్రేమవృత్తాంతం కూడా సఫలం కాలేదు.

తంజావూరు సరస్వతీమహల్‌లో పనిచేస్తూ ఉండగానే "హిందూ" పత్రికలో పడిన ప్రకటన యాదృచ్ఛికంగా చూసి రామచంద్ర లాహోర్ విశ్వవిద్యాలయ అనుబంధ సంస్థ ఆయిన ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారంలో వివిధ దక్షిణభాషా లిపులలో ఉన్న ప్రాచీన గ్రంథాలకు వివరణ సూచిక రూపొందిచే పండితోద్యోగానికి దరఖాస్తు చేశారు. ఆ ఉద్యోగంలో ఆయన్ను నియామకం చేస్తూ ఆయనకు లాహోర్ నుంచి ఉత్తర్వులు అందాయి. బహుశా ఈ ఉత్తర్వులు గన్నవరపు వారి కుటుంబంతో తమ యెడబాటుకు దారితీసిన పరిస్థితుల అనాశ్వాసిత ఉద్వేగభరమైన రోజులలో రామచంద్రకు అంది ఉండవచ్చు. ఇది చాలా మంచి అవకాశం అనుకున్నారాయన. వెళ్లి ఆదిలక్ష్మిగారికి వీడ్కోలు చెప్పారు. ఆమె వివేకవతి కాబట్టి పెద్దవారి అనుమతి లేకుండా పెళ్లాడడం శుభస్కరం, శోభస్కరంకాదని ఆయనకు స్నేహితోపదేశం చేసి సన్నజాజిపూలను దోసిటిలో పోసి శుభాకాంక్షలందజేశారామె.

ఈ విషయాలను ప్రసక్తం చేస్తూ రామచంద్ర స్వీయచరిత్రలో పెళ్లే

వద్దనుకున్నాను' అని రాశారు, కాని ఆయన పెళ్లి చేసుకున్నారు, తండ్రిగారి పట్ల మమకారం వదులుకోలేక. ఈ విషయం రామచంద్ర స్వీయచరిత్రలో ఇట్లా ప్రస్తావించారు. 'నాకు మే 7వ తేదీన (1939) వివాహం జరిగింది. సురపురం అనే సంస్థానం అత్తగారి ఊరు. ఇది గుల్బర్గాజిల్లాలో గుల్బర్గాకు ముప్ఫై మైళ్లలో ఉంది. నా అర్ధాంగి పేరు అనంతలక్ష్మి. ఎక్కువ చదువుకున్నదేమీ కాదు. కన్నడం మిడిల్ చదివింది. హిందీ పరీక్షలేవో పూర్తి చేసింది. మా నాన్నగారు కుదిర్చిన సంబంధం. నాకు పెళ్లి వద్దని, రానని అన్నాను. 'నా పరువు కాపాడు' అని టెలిగ్రాం ఇచ్చారు. మొక్కుబడిగా పెళ్లి చేసుకొనివచ్చాను. లాహోర్ ఉత్తర్వు వచ్చింది, ఆ ముహూర్తబలంతోనేనేమో ! (హంపీ నుంచి హరప్పా దాక - పుట 380-3వ ముద్రణ-2004) తమ ఇల్లాలి పేరు అనంతలక్ష్మి అని చెప్పారు గదా రామచంద్రగారు. వారి కుటుంబానికి నిజంగా ఆమె అనంతలక్ష్మియే. రామచంద్రకు ఆమె నిత్యానపాయినిగా ఉండకపోయినా - అంటే ఆయనది సంచారప్రవృత్తి అని ఆయనే చెప్పుకున్నారు - ఒక్క ఉద్యోగంలో ఆయన ఎప్పుడూ స్థిరంగా ఉండలేదు, ఉండలేరు-కనుక ఇంటిపట్టున ఆయన ఉండలేదు - అయినా ఆమె రామచంద్రగారికి నీడలా ఉండేది అంటే నీడనిచ్చిన ఆసరా అయింది. నీడలా నిలవకపోయినా జీవితాంతం ఆమె ఆయనకు చల్లనినీడలా ఉండేది. తమ పిల్లల చదువులు, పెళ్లిపేరంటాలు ఆమే చూసుకున్నది అని చెప్పాలి. ఆయన ఈ విషయంలో 'తామరాకుపై నీటిబొట్టు'. ఆయన ఉద్యోగప్రవృత్తి రీత్యా ఇటూఅటూ తిరుగుతున్నా ఊళ్లుమారుతున్నా తమ ముగ్గురు పిల్లల చదువులు చూసుకొంది. వారి ముగ్గురు పిల్లలూ డాక్టరేట్‌లు సాధించారు. దురదృష్టవశాత్తూ ఆ తల్లికి ఐదారుసార్లు గర్భనష్టం జరిగింది. లేకుంటే ఇవాళ రామచంద్ర సంతానం పదిమంది కళకళలాడుతూ తమ వంశానికి పేరు ప్రతిష్ఠలు తెచ్చేవారు.

శ్రీమతి అనంతలక్ష్మి రక్తాక్షినామ సంవత్సరం అంటే 1924వ సంవత్సరం భాద్రపదపూర్ణిమనాడు జన్మించారు. ఆమెకు పెళ్లినాటికి 15 సం.ల వయసు. ఆమె కాపురానికి వచ్చేనాటికి 20 సం.ల వయసు. నిజానికాకుటుంబాని కామె నిత్యపూర్ణిమ. పెళ్లయిన తర్వాత సుమారు 5 సంలు రామచంద్ర ఆమెను గూర్చి స్మరించనైనా లేదు. ఒక ఉత్తరం ముక్క అయినా రాయలేదు. నలమహారాజులా ఆమెను పరిత్యజించారు. దీనికి కారణం ఆయన పెళ్లయిన రెండునెలలోనే లాహోర్ వెళ్లిపోయారు, అటు తర్వాత లక్నో, కాన్పూరులలో పరిభ్రమించారు. ఆ తరువాత రెండవ ప్రపంచయుద్ధపురోజులలో సైన్యంలో చేరిపోయినారు. సైనిక శిబిరాలతో పశ్చిమోత్తరప్రాంతాలలో రెండు సంవత్సరాలు గడిపారు. ఆమె ఏమైపోతుందో, ఏమైపోయిందో కూడా రామచంద్ర విచారించలేదు.

సైన్యంలో ఉండలేక, పత్రికారంగంపై ఉండే మక్కువతో తండ్రిగారి సలహాపై

ఆయన ఆంధ్రదేశం వచ్చారు. అప్పుడాయన సురపురం వెళ్లారు తాను గృహస్థునని గుర్తువచ్చి. అదొక కరుణగాథ. పురాణాలలో కథకేమీ తీసిపోదు. శ్రీమతి అనంతలక్ష్మిగారికి నలుగురు అక్కలు. ఒకరే అన్న. ఆయన పేరు గుండాచార్యులవారు. స్థానికంగా ఆయన ఒక ప్రాథమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయవృత్తి నిర్వహించేవారు. వారి తండ్రిగారు వేంకటాచార్యులవారు. వారి పూర్వపూర్వతరాలలో ఎప్పుడో దక్షిణదేశం నుంచి సురపురం సంస్థానాధిపతుల కోరిక మేరకు వచ్చి ఇక్కడ స్థిరపడ్డారు. పెరుమాళ్లసేవకై వచ్చారు కాబట్టి ఇక్కడి వైష్ణవ కుటుంబాలలో వారింటిపేరు పెరుమాళ్లవారైంది. ఈ కుటుంబాన్ని కందాళంవారు, కందాడైవారు అని కూడా అంటారు.

శ్రీమతి అనంతలక్ష్మిగారి తండ్రిగారు వేంకటాచార్యులవారు గొప్ప సంస్కృత విద్వాంసులు. గద్వాల సంస్థానంలో వీరికి వార్షికాలుండేవి. స్థానికంగా వీరికి ఒక వైష్ణవ మఠాధిపత్యం ఉండేది. మైసూరులోని పరకాలమఠం సంబంధంగా ఈ మఠం పూజాపురస్కారాలు పెరుమాళ్లవారు నిర్వహించేవారు. శ్రీమతి అనంతలక్ష్మి వేంకటాచార్యులవారి కడగొట్టు సంతానం. ఆమె తల్లిగారి పేరు సీతమ్మగారు. నాయనమ్మ రంగమ్మగారు. అనంతలక్ష్మిగారు తాతనెరుగరు కాని నాయనమ్మ ముద్దుమురిపాలు పొందారు. శ్రీమతి అనంతలక్ష్మిగారి పెళ్లైన కొద్దిమాసాలకే తండ్రి గతించారు. పెద్ద గంపెడంత సంసారం. తనకు నలుగురు అక్కలు. వారివి పెద్ద సంసారాలు. పురుళ్ళూ పుణ్యాలూ పండగలూ పబ్బాలూ, కార్యకరామతులు. భర్త చూడబోతే ఎక్కడున్నారో తెలియదు. ఒక ఉత్తరం ముక్క లేదు. ఒక్క కబురు లేదు. ఆ నాలుగైదేళ్లు ఆమె ఎంత తల్లడిల్లిందో ఊహించవచ్చు. ఆమెకు విద్యార్జన పట్ల ఎంతో ఆసక్తి ఉండేది. అయితే సురపురం నిజాంసంస్థానంలో ఉండేది కాబట్టి పెద్దఇంటి ఆడవాళ్లు ఘోషాపద్ధతి పాటించేవారు. బాలికలు పాఠశాలలకు వెళ్లకూడదు. అయినా శ్రీమతి అనంతలక్ష్మి పాఠశాలకు వెళ్లింది. ప్రిన్సిపాల్‌గారి పెట్టెబండిలో పాఠశాలకు వెళ్లివస్తుండేది. హిందీపరీక్షలు పాసైంది. కన్నడం బాగా వచ్చు. అత్తవారింటికి వచ్చిన తర్వాతను, భర్తగారి నిరంతర సాహితీ వ్యాసంగంతోనూ తెలుగు బాగా నేర్చుకుంది. ఆమె చాలా శాంతురాలు. అత్తవారింటికి వచ్చిన తరువాత కూడా భర్త కొన్నాళ్లు మిలిటరీ సర్వీసులో ఉన్నారు. రామచంద్ర తోబుట్టువులు ముగ్గురు సోదరులు, ముగ్గురు చెల్లెళ్లు. వీరి పెళ్లి పేరంటాలు, చదువులు, మట్టుమర్యాదలు పెద్ద కోడలుగా ఆమె నిర్వహించింది. అందుకనే మామగారు శేషాచార్యుల వారు ఆమెనెంతో మెచ్చుకొనేవారు. మా ఇంటిపరువు ప్రతిష్ఠలు, సంప్రదాయమర్యాదలు మా పెద్దకోడలు నిలిపింది, వాటికామే ఆధారమైంది అనేవారు. ఒకసారి రామచంద్ర ఏదో కన్నడగ్రంథం అనువాదం చేస్తున్నారు. ఒకమాట ఆయనకు అర్థం కాలేదు. అప్పుడు అనంతలక్ష్మిగారు పుట్టింట్లో ఉన్నారు. రామచంద్ర సురపురానికి

టెలిగ్రాం ఇచ్చి ఇల్లాల్ని వెంటనే రావాలన్నారు. ఆమె వచ్చారు. ఇంతకూ 'చత్తల్లె' అనే ఆ కన్నడ పదానికి 'అవు పొదుగు' అని అర్థం. ఆమె వచ్చి ఆ అర్థం చెప్పిన తరువాత ఆయన మనసు కుదుటపడింది. విశేషించి ఆయన ఆమె నుంచి కన్నడం, ఆమె ఈయన నుంచి తెలుగు నేర్చుకొని ఉండవచ్చు.

హైదరాబాదులో 1944-45 ప్రాంతాలలో రామచంద్ర 'మీజాన్' పత్రికలో పని చేసినప్పుడు పూతచరిత్రుడు అడవి బాపిరాజుగారు రామచంద్రను ఎంతగానో అభిమానించారు. అన్ని వద్దికలు దిద్దారు పత్రికావృత్తి పరమైనవి అని రామచంద్రే స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. కాపురపు తొలి సంవత్సరాలు రామచంద్ర దంపతులు మొజాంజాహీ మార్కెట్ ప్రాంతంలో ఒక చిన్న ఇంట్లో ఉండేవారు. బాపిరాజుగారు వీళ్లింటికి తరుచూ వచ్చేవారు. మీజాన్ ఆగిపోయి రామచంద్ర మద్రాసు వెళ్లి ఆంధ్రపత్రికలో చేరిన తర్వాత కూడా బాపిరాజుగారు తరచు వీరింట బస చేసేవారు. శ్రీమతి అనంతలక్ష్మి అంటే బాపిరాజుగారికి ఎంత అభిమానమూ, వాత్సల్యమూ అంటే, ఎంత మెప్పూ, ప్రశంసా అంటే బాపిరాజుగారు రచించిన పరమవిశిష్టమైన నవల 'కోణంగి'లో నాయిక అనంతలక్ష్మిగా లలితకళా విస్తార విలాససుగుణశోభితురాలై రూపుదిద్దుకుంది. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రామచంద్రగారింటికి తరచు వచ్చేవారు. రాత్రింబవళ్లు రామచంద్రగారింట్లో సాహిత్యగోష్ఠులు. సాహిత్యవ్రతులు, అక్షరలుబ్ధులు అక్కడకు వచ్చి తిష్ఠ వేస్తూ ఉండేవారు. అర్ధరాత్రి దాకా ఒకటే చర్చలు- చర్చోపచర్చలు. వీళ్లకు కాఫీలు, ఫలహారాలు ఆ తల్లి ఎలా కూర్చేదో ! రామచంద్రగారికి ఏ నాడూ ధనసంపాదన యావ లేదు. ఇంట్లో 'మహానసం' ఎలా నిర్వాహమవుతుందో ఆ ఊసు ఆయనకెందుకు ? అందుకే పిలకాగణపతిశాస్త్రిగారు 'రామచంద్రా – మీదేముందయ్యా, ఆమె అన్నపూర్ణాదేవి అపరావతారం. అందువల్లే మీరు ఆడింది ఆట, పాడిందిపాటగా సాగుతున్నది' అని చనువుగా మేలమాడేవారుట. రామచంద్ర ఎప్పుడింటికి వస్తారో తెలియదు. ఒకసారి 'కందులు' (కాయధాన్యం)కు ఆ పేరు ఎట్లా వచ్చిందో కోరాడ రామకృష్ణయ్యగారింట్లో చర్చించి, వితర్కించి అర్ధరాత్రి దాటి తూరుపు తెలిరేకలు ఇదిగో అదిగో బయటపడపోతున్నాయి అనగా ఇల్లు చేరామని రామచంద్రే ఒక ప్రస్తావనలో చెప్పారు.

రాజకీయ నాయకులు, సినిమా ప్రముఖులు, సాంస్కృతిక జిజ్ఞాసువులు, రంగస్థల కళాకారులు రామచంద్రగారింటికి వస్తూ ఉండేవారు. చిత్తూరు వి. నాగయ్య, భానుమతి, జి. వరలక్ష్మి వచ్చేవారు. ఇక సాహిత్యమూర్తులలో కృష్ణశాస్త్రి సోమశేఖరశర్మ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మలాంటి వారూ, కాసు బ్రహ్మానందరెడ్డి, సంజీవయ్య మొదలైన రాజకీయప్రముఖులూ వచ్చేవారు. రామచంద్ర గొప్ప సాహిత్యవేత్త మాత్రమే కాక సుమారు 25సం.లు పుష్కరం, పుష్కరంపాటు ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలలో ప్రముఖపాత్రికేయుడుగా పని చేశారు కదా ! పత్రికల వాళ్లంటే

ఎవరికైనా మోజే !

మద్రాసు తిరువళిక్కేణి (ట్రిప్లికేన్)లో సత్యనారాయణశ్రేష్ఠిగారనే వెన్న పూసవ్యాపారి ఇంటిలో 35సం.లు రామచంద్ర కుటుంబం కాపురముంది. ఈ శ్రేష్ఠిగారు శ్రీ వేటూరి ప్రభారకశాస్త్రిగారి శిష్యులు. యోగసాధకులు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తరచువచ్చేవారు రామచంద్రగారింటికి. శ్రీరామచంద్ర మల్లంపల్లి సోమశేఖరశర్మగారి కంకితమిచ్చిన మన 'లిపి పుట్టుపూర్వోత్తరాలు' అంకితోత్సవ సభ రామచంద్ర ఇంట్లోనే జరిగింది. రాంభట్ల కృష్ణమూర్తి, రామచంద్రగారికి కూర్చుమిత్రుడు. రామచంద్రను కృష్ణమూర్తి ఎప్పుడూ బావగారుగా సంబోధించేవారు. కృష్ణమూర్తిపట్ల రామచంద్రకు చాలా మెప్పు ఉండేది. ఏమంటే ఆయన పురాతత్త్వ శాస్త్ర విశారదుడని.

విద్వాన్ విశ్వం (మీసరగండ విశ్వరూపాచారి) రామచంద్రగారికి అతి సన్నిహిత మిత్రుడు. ఒకసారి విశ్వంగారికి చాలా జబ్బు చేసింది. అప్పటికాయనకు మద్రాసులో సంసారస్థిరత లేదు. ఒక సంవత్సరంపాటు విశ్వం రామచంద్రగారింట్లోనే ఉన్నారు. ఆయనకు పథ్యపానాలు, పరిచర్యలు, రోగోపశమనసేవలు శ్రీమతి అనంతలక్ష్మిగారే సమకూర్చింది.

మానవల్లి రామకృష్ణకవిగారికి వయసు మీరిపోయింది. ఆయన్ను చూసుకొనేవారెవరూ లేకపోయినారు. తనువు శిథిలబంధమైపోయింది. అడుగు వేయలేకపోయేవారు. ఆయనను ఇంట్లో ఉంచుకొని చేయి పట్టుకొని నడిపించి ఆదరించి సేవించి భోజనం పెట్టారు శ్రీమతి అనంతలక్ష్మి. రామకృష్ణకవిగారికిష్టమని ఎప్పటికప్పుడు తోడు పెట్టిన పెరుగు సమకూర్చేవారామె. ఆ విషయం రామచంద్రే రాసుకున్నారు.

శివలెంక శంభుప్రసాద్‌గారు 'మీ వైష్ణవుల పులిహోర రుచే వేరు. నా కోసం కాస్త పంపండి' అంటే పెద్ద కారియర్‌లో ఎన్నో గిన్నెలతో పులిహోరే కాక, దద్ధోజనం, చక్రపొంగలి పంపేవారు ఆ తల్లి. అవి తీసుకొని పోవటానికి వచ్చిన కారు డ్రైవరుకి ముందుగా భోజనం పెట్టి ఆ తరువాతనే పంపించేదానినని శ్రీమతి అనంతలక్ష్మిగారే ఒక ప్రస్తావనలో చెప్పారు. మైసూరు పరకాలస్వామిమఠంలో ఆమె సమాశ్రయణం పొందారు. అప్పటికామె వయసు 22సం.లు. స్వాములవారు మంత్రించి ఇచ్చిన నారికేళం ఐదు సంవత్సరాలు భద్రంగా తమ ఇంట ఉన్నట్లు ఆమె గుర్తు చేసుకున్నారు.

శ్రీమతి అనంతలక్ష్మి ఆయుర్వేద పండితురాలు. తన పిల్లలకు అనారోగ్యం, అత్యంత ప్రమాదకరమైన వ్యాధి కలిగినా తనకు తెలిసిన చిటకావైద్యంతోనే నయం చేసేవారు.

ఆమె దేవీ ఉపాసకురాలు. రామచంద్రకు 55సం.ల వయసున అతి

ప్రమాదకరమైన జబ్బు చేసింది. ప్రాణం పోయిందనే అనుకున్నారు. చివరి ప్రయత్నంగా గరళంకూడా ఇచ్చారు. బయట అరుగు మీద ఉంచారు. అప్పుడాయనకు ఒక స్వప్నదర్శనం కలిగింది. పార్వతీదేవి కన్పించి నీ ఆయుష్షు అయిపోయింది అని చెప్పింది. 'అయ్యో నేనింకా ఎంతోఎంతో రాయాలి కదా – చెప్పాలి కదా' అని తాను విషణ్ణుడైనట్లూ నీ ఇల్లాలు నా భక్తురాలు కాబట్టి నీకింకా కొంతకాలం ఆయుష్షు పొడిగిస్తాను అని జగన్మాత చెప్పినట్లూ ఆయనే ప్రసక్తం చేస్తుండేవారు. ఇందువల్ల ఆయనకు ఇల్లాలి పట్ల కృతజ్ఞతాభరితమైన ఆదరభావం ఉండేదని తెలుస్తుంది. శ్రీమతి చేత మెట్రిక్యులేషన్ పరీక్ష ఇప్పించాలని ఆయనెంతో కుతూహలపడేవారు. కాని పెద్ద సంసారం, పేదరికం, ఆర్థిక ఇబ్బందుల వల్ల రామచంద్ర కోరిక తీరలేదు. ఎలాగో పిల్లలకు, భర్తకు భోజనం పెట్టి ఆమె ఉపవాసం ఉండటం కూడా జరిగేదని వారి పిల్లలే చెపుతారు. ఇరుగుపొరుగులకు కాని, బంధువులకు కాని, తెలిసిన వారికికాని జబ్బు చేస్తే ఆస్పత్రిలో వారికి తోడుండేవారు అనంతలక్ష్మి.

జాతకాలను నమ్మినా, నమ్మకపోయినా ఆయనది మిథునరాశి, అనంతలక్ష్మిగారిది మీనరాశి. అందువల్ల వారు ద్వంద్వంగా ఉండాల్సిందే కాని నిర్ద్వంద్వంగా ఉండే వీలు లేదని కార్తాంతికుల చమత్కరింపు. ఏమైతేనేం ఆయనకు తగిన ఇల్లాలామె. ఆయన వ్యక్తిత్వానికి వ్యాఖ్యానమామె. ఆయన సంస్కృతికి సాకారరూపమామె. ఆయన సంసారానికి సారభూతమైన ఆలంబనమామె. 58సం.ల వారి వైవాహిక (దాంపత్య) జీవితంలో ముందు సంవత్సరాలలో ఆయన కోసం కని పెట్టుకొని, తరువాత సంవత్సరాలలో ఆయనను కనిపెట్టుకుని ఉండి, ఆయన జీవితాన్ని దిద్దారామె. ఆయన ఎప్పుడైనా అధైర్యపడితే, ఆందోళన చెందితే ఆమె ధైర్యం చెప్పేవారని వారి పిల్లలు చెపుతారు. చుట్టాల సురభి ఆమె. ఎవరికైనా ఏ సమయంలోనైనా చేతనైన సాయానికి ఎప్పుడూ ముందుండేవారామె. పోతన మహాకవి మహాభాగవతం చతుర్థస్కంధం పురంజనోపాఖ్యానంలో ఈ పద్యం ఉంది.

'పొగడొందు జననీ కానీ, తగవెరుగనియట్టి దయితయ కానీ
తగనుండని యింట నుంటగు చక్రవిహీనమగు రథమునం దుంటరయన్

సంసారంలో కొన్ని ఒడిదొడుకులు తటస్థపడినా ఆయన జీవనరథం సాఫీగా నడచిందని ఆయన స్వీయచరిత్ర చూస్తే తెలుస్తుంది. నిజానికాయన స్వీయచరిత్ర ఆయన 'స్వీయచరిత్రే' !

అది రామచంద్ర రాసి ఉండాల్సింది. ఆయన తన 30సం.ల వరకే స్వీయచరిత్ర రాశారు కాబట్టి తక్కిన విషయాలన్నీ మనం ఊహించుకోవాలి. ఆమె గొప్ప ఇల్లాలని చెప్పటానికి వారి పిల్లలే సాక్ష్యం !

# 9. హంపీ నుంచి హరప్పా దాక

ఇది తిరుమల రామచంద్ర స్వీయచరిత్ర. స్థూలంగా తెలుగువారి 20వ శతాబ్ది సాహిత్య, సామాజిక, సాంస్కృతిక, స్వాతంత్రోద్యమ చరిత్ర. తన ముప్పై సంవత్సరాల జీవిత సంఘటనలనే ఈ స్వీయచరిత్రలో ఆయన చేర్చారు. జీవితానుభవాలనే చెప్పారు. ఆయన పత్రికారచనా వృత్తిలో ప్రవేశించడం వరకే ఈ స్వీయచరిత్ర చెబుతుంది. తన జీవితానికి పరమార్థంగాను, ఆదర్శంగాను, ఎంచుకొన్న పత్రికా రచన వృత్తిలో ఆయన అటు తర్వాత అర్ధశతాబ్ది పని చేశారు. ఆ విషయాలు స్వీయచరిత్రలో చేరలేదు. స్వాతంత్ర్యానంతరం దేశ సకల జీవనరంగ పరిణామాలను ఆయన స్పృశించలేదు.

అయినా తెలుగులో వెలువడ్డ స్వీయచరిత్రలలో రామచంద్ర స్వీయచరిత్రకు ప్రత్యేక స్థానమున్నది. ఈ ఆత్మకథకు పేరు పెట్టడం మొదలుకొని తన జీవితానుభవాలను, అనుభూతులను పరిధీకరించడం వరకు ఒక ఆకర్షణీయమైన విన్యాసం కనపడుతుంది. తానొక కేంద్ర బిందువు. కేంద్ర బిందువు లేనిదే వృత్తం లేదు. రామచంద్ర తన ఇతివృత్తాన్ని విశాల జీవితానుభవ పరిధితో వివరించారు. ఆత్మీయతను అక్షరాక్షరం విన్యసింప చేశారు.

ఈ స్వీయ చరిత్ర గూర్చి ఆయనే ఎంతో భావుకంగా ఇట్లా చెప్పుకున్నారు. 'రామచంద్ర విశిష్ట వ్యక్తి. వైరుధ్యాల పుట్ట. వైపరీత్యాల మెట్ట. పాదరసాన్ని పరిహసించే పరుగు, మెరపును మించిన చాంచల్యం. ఇంతటి వైరుధ్యాల వైవిధ్యంలో, వైపరీత్యాల వైరూప్యంలో రచయిత కనిపిస్తాడు. విమర్శకుడు తొంగిచూస్తాడు. భాషావేత్త-భాసిస్తాడు. ప్రతిదాని పుట్టుపూర్వోత్తరాలు పరిశీలించే పరిశోధకుడు పలుకరిస్తాడు. కనిపించిన దాన్నంతా కలంతో కబళిద్దామనే భావుకుడు గోచరిస్తాడు. తెలిసినదాన్నంతా చెప్పాలనే భావుకుడు గోచరిస్తాడు. తెలిసినదాన్ని తేట మాటలతో అందించే పత్రికా రచయిత తారట్లాడుతాడు. ఉపనిషత్కాలపు స్వర్ణయుగం అవతరించాలనే దురాశాపరుడు ప్రత్యక్షమవుతాడు.' అంటూ భావించారు. 'ఇదొక దేశద్రిమ్మరి అనుభవ విశేషంగా సత్యాన్వేషి కథనంగా, జిజ్ఞాసువు ఆవేదనగా పాఠకుల మనసుకు దగ్గరవుతుందని నా విశ్వాసం' అని ఆశించారు. ఈ స్వీయచరిత్రను గూర్చి ఆయన అంచనా నిజమైంది. సమకాలీన శతాబ్ది సాహిత్య చరిత్రలో తెలుగు పుస్తకాలు పది

నుంచి పదిహేను దాకా ఎంపిక చేయవలసి వస్తే రామచంద్ర స్వీయచరిత్రకు తప్పక అందులో చోటుంటుంది. ఇది తెలుగు పాఠకుల అభిమానాన్ని ఎంతగానో పొందగలిగింది. ఇటీవలి కాలంలో తెలుగు పుస్తక ప్రచురణ చరిత్రలోనే ఐదారు సంవత్సరాల వ్యవధిలో మూడు ముద్రణలు పొందిన స్వీయచరిత్ర ఇంకొకటి లేదు !

ఈ స్వీయచరిత్రలో 61 చిన్నచిన్న ప్రకరణాలున్నాయ. బాల్యం కౌమారం యౌవనం ఇతివృత్తీకరించిన 'త్రిదశుడి' కథ ఇది. దేవతల వయసు ఎప్పుడూ ముప్ఫయేళ్లుగానే స్థిరంగా ఉంటుంది కాబట్టే వాళ్లను 'త్రిదశు'లన్నారని ఒక సాహితీవేత్త చమత్కరించాడు. రామచంద్ర స్వీయచరిత్రకు ఈ చమత్కారాన్ని అనువర్తింపచేయవచ్చు.

తెలుగుసాహిత్యంలో బయలుదేరిన అత్యంతాధునిక ప్రక్రియ స్వీయచరిత్ర. ఈ ప్రక్రియకు ఇంకా ఒక శతాబ్ది చరిత్ర కూడా లేదు. ఇంచుమించుగా నూరేళ్లలో స్థూలంగా లెక్కలోకి తీసుకుంటే 200 దాకా ఈ సంఖ్య చేరుకుంటుంది. అయితే ఆద్యంత సన్నివేశ నిర్వహణలో కాని, పేరులోకాని, ప్రకరణాలకు పేరు పెట్టడంలో కాని ఈ స్వీయచరిత్ర అంత ఆకర్షకంగా, ఆసక్తికరంగా, విషయ విజ్ఞాన వైవిధ్యభరితంగా, విశాలోదార మానవ జీవిత చిత్రణ సుందరంగా, విస్తృతదేశ పర్యటన విశేష సన్నివేశ సముపేతంగా చదివించగల స్వీయచరిత్ర తెలుగులో ఇంకొకటి లేదు. సకల భారతీయ భాషలలో చూసినా ఇటువంటి స్వీయచరిత్రలు చాలా తక్కువ సంఖ్యలో ఉండవచ్చు.

'హంపీ నుంచి హరప్పా దాక' అనే పేరులోనే రామచంద్ర సాహితీ సామాజిక వ్యక్తిత్వం స్పష్టపడుతున్నది. ఆయన జిజ్ఞాస, గవేషణ శీలం అర్థమవుతున్నవి. పది సంవత్సరాల వయసు దాకా ఆయన హంపీ విజయనగర పరిసరాలలోనే తన ఊహాభావుక ప్రపంచాన్ని పరిశీలించారు. అధ్యయనం చేశారు. ఎవరి జీవితంలోనైనా బాల్యం అదొక అద్భుత ప్రపంచం. సృజనాత్మక శక్తులున్న వారిలో ఆరోజులు ఉత్సుకలోకాల ద్వారాలను అపావృతం చేస్తాయి. ముకుళన దశ నుంచి పువ్వులు విచ్చుకుంటున్నట్లుగా వారిలో శరీర మానసిక శక్తుల ఉన్మీలనం ప్రారంభమవుతుంది. సృష్టిలోని సంగీతాలు కౌమారంలో మరింత ఆకర్షవంతమవుతాయి. బాల్యానికి వీడ్కోలు చెప్పే దశ దాకా రామచంద్ర హంపి, హొసపేట, కమలాపురం, ఆనెగొంది వంటి ప్రదేశాలలోనూ, శ్రీవైష్ణవ సంప్రదాయ కుటుంబ జీవన సరళిలోనూ తన వ్యక్తిత్వాన్ని రూపొందింపచేసుకున్నారు. వికసింపచేసుకున్నారు. హంపీ కోదండరామ స్వామి దేవాలయంలో తమకు సంస్కృతం బోధించిన గురువు గారిని సేవించుకున్నారు. ఎనిమిదేళ్ల వయసుననే పంచ పంచ ఉషఃకాలంలోనే మేల్కాంచి రెండువందల మెట్లు దిగి అరఫర్లాంగు

దూరం తుంగభద్రాతీరానికి వెళ్ళి నీటి బిందెతో మళ్లీ అన్ని మెట్లు ఎక్కి గురువు గారికి వేడినీళ్లు కాచేవాడు. అట్లానే ఆనెగొందిలో వెంబారు అంబాళం రామాచార్యుల వారి వద్ద సంస్కృత కావ్యాలు చదువుకునే రెండు-మూడేళ్లు వారి బట్టలు ఉతికి శుభ్రం చేసే వాడినని కూడా వారు రాసుకున్నారు. హంపీ శిథిలాలలో సావాసకాండ్రతో ఆయన ఆటలాడారు. తాతతండ్రుల నుంచి అక్కడి శిల్పాలు, గుళ్లు, గోపురాలు, దేవతోత్సవాల గూర్చి గాథలు తెలుసుకున్నారు. చరిత్ర నర్థం చేసుకున్నారు. చారిత్రక పరిణామాల నవగతం చేసుకున్నారు. అందువల్ల ఆయన వ్యక్తిత్వ పరిణతి కాధారభూమిక చేకూర్చినది హంపీ బాల్యమనే చెప్పాలి. సుమారు ఆయన జీవిత కాలంలో రెండో దశకం అంటే కౌమారం తిరుపతి సంస్కృత కళాశాల విద్యార్జన దశకంతో ముడిపడి ఉంది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడం, పందొమ్మిదో ఏటనే ఆయనకు కారాగారప్రాప్తి ఆయన కౌమార జీవిత ముఖ్య ఘట్టాలు. తరవాత పది సంవత్సరాలు సంచార జీవనం, దేశాటనం, విద్యాపరిశ్రమ, పండిత పరిచయం, గృహస్థాశ్రమ ప్రవేశం జీవనయానానికి అనువైన వృత్తి స్థిరీకరణ నిర్ణయం సన్నివేశపరంగా ఆయన జీవన గమనం సాగింది. ఈ మూడు దశలు ఆయన జీవిత వ్యక్తిత్వ దిశానిర్దేశం చేశాయి. స్థూలంగా మూడు విభాగాలుగా సమీక్షించటానికి వీలున్న ఆయన స్వీయచరిత్రలో మొత్తం అరవై ఒక్క ప్రకరణాలున్నాయి. ఇంచుమించు ఈ 61 చిన్న చిన్న అధ్యాయాలు సమస్సమవిభక్తంగానే ఉన్నాయి. రామచంద్ర అధ్యయనం చేసిన విశాల ప్రపంచమంతా ఈ స్వీయచరిత్రలో ఆవిష్కృతమైంది. అదొక అద్భుత ప్రపంచమనిస్తుంది. ఒక వ్యక్తి జీవితంలో ఎందరో అసాధారణ వ్యక్తులు, అతివిచిత్ర సన్నివేశాలు సమకూడటం ఆశ్చర్యకరమే, 'నేను చూసిన అద్భుతాలు' అని స్వీయచరిత్రలో ఒక ప్రకరణం కూడా రాశారు రామచంద్ర. ఇటువంటి సంఘటనలు, సన్నివేశాలు, వీటికి కారకులైన వ్యక్తులు ప్రసక్తమైన ఉదంతాలు అరవైకి పైగానే ఎంచవచ్చు రామచంద్ర స్వీయచరిత్రలో.

ఒక ఆశ్చర్యకరమైన విషయం వీరి స్వీయచరిత్రలో ప్రసక్తమైంది. అది జ్యోతిష విద్య. పురాభారతీయ ప్రాభవ విద్యానిరూపకమైనది ఈ శాస్త్రం. వేదాంగాలలో జ్యోతిషం కూడా ఒకటి. తనకు జ్యోతిషంలో నమ్మకం లేదని ఒకచోట రామచంద్ర ప్రస్తావించారు కాని చిట్టచివరి వరకు వారి జాతకం వారి దగ్గర భద్రంగా ఉండడమే కాక ఈ విద్యలో ప్రాజ్ఞులని తాము భావించిన వారితో ఆయన తరచు సంప్రదిస్తూ ఉండేవారు కూడాను. రామచంద్ర తిరుపతి సంస్కృత కళాశాలలో చదువుకుంటూ ఉండగా రాగంపల్లి నుంచి మేనమామ గారు తమకు బాగా తెలిసిన వ్యక్తి ద్వారా రామచంద్రకు పందొమ్మిదో ఏట కారాగారప్రాప్తి ఉందనీ, తగిన హెచ్చరికతో ఉండవలసిందనీ కబురు చేసినట్టు స్వీయచరిత్రలో రామచంద్ర ప్రస్తావించారు. ఆ

గ్రహగతుల అంచనాలు నిజమైనాయి. తంజావూరు సరస్వతీ మహల్‌లో ఆయన ద్విపద భారత తాళపత్రప్రతి ముద్రణయోగ్యప్రతి రూపొందిస్తూ ఉండగా అతిసాధారణ వ్యక్తిగా కనిపించే ఒక చెట్టు కింది జ్యోతిష్యుణ్ని తంజావూరులో ఇంకా ఎన్నాళ్లు ఉంటామని ప్రశ్నించడం, ఆ జ్యోతిష్యుడు రేపీపాటికి మీరు మీ స్వస్థలాలకు తిరుగు ప్రయాణంలో ఉంటారని చెప్పటం కేవలం యాదృచ్ఛికం కాజాలదు. అటువంటి విద్యలేవో పరంపరగా భారతదేశంలో ఉంటూనే ఉన్నాయని అనుకోవలసి వస్తుంది. ఇంతేకాదు సంస్కృత కళాశాలలో గిరిధరాచార్యుల వంటి మహామహోపండితులను, లాహోర్‌లో మాధవశాస్త్రి భండారీ వంటి మహోపాధ్యాయులను రామచంద్ర తన జాతకం విషయమై సంప్రదించారు. వారు చెప్పిన విషయాలన్నీ దాఖలాకు వచ్చాయని కూడా రామచంద్ర స్వీయచరిత్ర ద్వారా స్పష్టం.

ఇక హరప్పా ప్రస్తావనతో తన ముప్పైనాలుగేళ్ల జీవితానుభవాలను ముగింప చేయడంలో కూడా ఒక గొప్ప ఔచిత్యం ఉంది. హంపీ చారిత్రకోజ్జ్వల ప్రాభవం ఐదు శతాబ్దాల కిందటిది కాగా హరప్పా నాగరకత ప్రాభవం ఐదు వేళ్ల నాటిది. అది వేదకాలపు నాగరకత అని రామచంద్ర విశ్వాసం. పురాచరిత్ర ఒక జాతి జీవితాన్ని ఆత్మసంపన్నం చేస్తుంది. అస్తిత్వాన్ని పునరుజ్జీవింప చేస్తుంది. ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది. అందుకే రామచంద్ర మొహంజొదారో, హరప్పాల ధరాగర్భ సుప్తనిక్షిప్త నాగరకతల గూర్చి అభినివేశంతో చర్చించారు. పురాభారతీయ సంస్కృతి జ్ఞాననిష్ఠమైన సమన్వితి స్వరూపమే కాని ఖడ్గవాదమూ కలహశీలము ఆక్రమణ స్వభావమూ కలది కాదని డా. సునీతి కుమార్ ఛటర్జీ వలెనే రామచంద్ర కూడా నమ్ముతారు. అందువల్ల ఆర్య ద్రావిడ సంఘర్షణలను రామచంద్ర అంగీకరించరు. భారతీయ నాగరకత విశాలోదార ఆదర్శపూరితమూ, ఆదానప్రదాన సంపన్నమూ అని రామచంద్ర ఆశయం.

రామచంద్ర గొప్ప దేశభక్తుడు. సైనికోద్యోగం విరమించుకొని అనంతపురానికి తిరిగి వచ్చే ముందు ఒకసారి మళ్లీ అమృతసర్ వెళ్లి అక్కడి అలనాటి జలియన్‌వాలాబాగ్ ఘోర దురంత స్మృత్యంకాలను దర్శించి నివాళించవలెనని ఆయన అభిలషించారు. కర్కోటకుడైన డయ్యర్ క్రౌర్యానికి ఆనవాలుగా జలియన్‌వాలాబాగ్ ప్రాకార కుడ్యాలలో తుపాకి గుళ్లు తొలచిన రంధ్రాలను చేతులతో తడిమి ఉద్విగ్న వివశుణ్ని అయినానని ఆయన స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. ఆ రాత్రి రైలు ప్రయాణంలో అవే దృశ్యాలు తనను వెన్నంటినట్లు కూడా ఆయన చెప్పుకున్నారు. అమృతసర్‌లోని సిక్కుల పరమ పవిత్ర ఆరాధ్య అర్చామందిరమైన స్వర్ణ దేవాలయాన్ని ఆయన దీపావళినాడు దర్శించడమే కాక భారతదేశంలో

సర్వదేవాలయాలు ఆ విధంగా నిర్వహించాలని కలలు కన్నారు. లక్నోలో, లాహోర్‌లో, కాన్పూరులో, క్వెట్టాలో, చమన్‌లో, ఢిల్లీలో, చెన్నపట్నంలో, హైదరాబాద్‌లో ఆయన జీవితంలో తారసపడ్డ వ్యక్తులను, సంఘటనలను రామచంద్ర సజీవంగా మానవతా చిత్తవృత్తుల విశ్లేషపరంగా రూపుకట్టించారు.

'హంపీ నుంచి హరప్పా దాక' అనే రామచంద్ర స్వీయచరిత్రలో 61 అధ్యాయాలు 61 కథల లాగా చదివిస్తాయి. అన్నీ కలిపినప్పుడు అదొక గొప్ప నవల అనిపిస్తుంది. ఆయన తన జీవితంలో దర్శించిన గొప్ప వ్యక్తులందరి గూర్చి రేఖాచిత్రాలు దర్శింపజేశారు స్వీయచరిత్రలో. 20వ శతాబ్దపు తెలుగు సాహిత్య పరులలో ఎవ్వరూ రామచంద్ర చూసినంత భారతదేశం చూడలేదు. వారి వలె ఆధునిక భారతీయ భాషా సాహిత్యాల పరిచయం సంపాదించలేదు. తమ సమకాలీన భారతీయ మహాకవులను, పండితులను కలుసుకోలేదు.

వారిలాగా చారిత్రక ప్రదేశాలు దర్శించలేదు. కళలూ శాస్త్రాలు అధ్యయనం చేయలేదు. ఆయన అధ్యయనం చేసినన్ని తాళపత్ర గ్రంథాలూ, ముద్రితాలూ చదవలేదు. ఈ విషయాలన్నీ ఆయన స్వీయచరిత్ర వివరిస్తుంది. రోచకంగా చదివిస్తుంది.

# 10. పరిశోధన

20వ శతాబ్ది తెలుగు సాహిత్యంలో గొప్ప పరిశోధకులు అని చెప్పదగిన వారు ఒక పదిమంది కనపడతారు. ఆ పదిమందిలోనూ రామచంద్రకు ప్రత్యేకత ఉంది. సమాజం, సాహిత్యం, వివిధ ప్రక్రియా వికాసం, భాషాచరిత్ర, సాహిత్య చరిత్ర, వంటి వివిధ విషయాలను సమన్వయించడం ఈ శతాబ్ది ప్రారంభం నాటికే అగత్యమైంది కనుక దేశచరిత్ర, శాసన పరిశోధన, కవుల కాలనిర్ణయం, భాషాశైలి వివేచన, శబ్ద సాధుత్వాసాధుత్వాలు, పాఠాంతర పరిష్కరణం, సాధుపాఠ నిర్ణయం మొదలైన విషయాలను గూర్చి కవి పండిత విమర్శకుల దృష్టి 20వ శతాబ్ది ప్రథమ దశకం నాటికే ప్రసరించింది. సరిగ్గా ఆకాలం నాటికే గ్రాంథిక, వ్యావహారిక భాషా ఆవశ్యక సిద్ధాంత రాద్ధాంతాలు బయలు దేరాయి. భాషా సాహిత్యాలపై వ్యాకరణ స్వరూప స్వభావ ప్రభావ చర్చలు మొదలైనాయి. అటు తర్వాత పరిశోధనకే ప్రాధాన్యం ఇచ్చిన పత్రికలు కూడా బయలుదేరాయి.

శాసన పరిశోధనలు చరిత్ర రచయితలకూ, కవుల చరిత్ర రచయితలకూ ఆవశ్యకమైనాయి. తాళపత్ర గ్రంథాలు పరిష్కరించి అచ్చు వేయడం, వాటిని రచించిన కవుల గూర్చిన కాల, కవితా ప్రతిభా, రచనా కళల చర్చలు తెలుగు నాట పరిశోధన ప్రాథమికదశా విశేషాలని చెప్పవచ్చు.

1913 నాటికే ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రారంభమైంది. ఈ పత్రిక ప్రాచీన కావ్య ప్రకటనకు, శాసన పరిశోధనకు, అపురూప విషయావిష్కరణకు దోహదం చేసింది. తెలుగులో సమగ్ర నిఘంటు నిర్మాణానికి కూడా ఈ సంస్థ పూనుకొన్నది. 20వ శతాబ్దం ప్రథమంలో పేరు ప్రసిద్ధులున్న విమర్శకులు, ముఖ్యంగా పరిశోధకులంతా ఈ పరిషత్పత్రికలో రచనలు చేశారు. సృజనాత్మక రచనలకు, ఆధునిక ప్రక్రియలకు ఈ పత్రికలో చోటుండేదికాదు.

ఈ పత్రిక ప్రారంభమైన ఆరు సంవత్సరాలకు గిడుగు రామమూర్తి పంతులుగారు 'తెలుగు' అనే పత్రికను ప్రారంభించారు. ఈ పత్రిక పూర్తిగా భాషా విషయక పత్రికే అని చెప్పాలి. నిఘంటువులు, కావ్యభాష, వాడుక భాష ప్రయోజనం, సమాజంలో విద్యావ్యాప్తి మొదలైన విషయాలను గూర్చి ఈ పత్రికలో చర్చలుండేవి. రామమూర్తి పంతులు గారి ప్రసిద్ధ రచనలన్నీ ఈ పత్రికలో వచ్చాయి. సంప్రదాయ

నిబద్ధతను వదులుకోలేని కవిపండితలోకం ఈ పత్రికను ఆదరించలేదు కాబట్టి రెండు సంవత్సరాలు కూడా ఈ పత్రిక రాలేదు. అటుతర్వాత మూడేళ్లకు అక్కిరాజు ఉమాకాంతం గారు తెలుగుదేశ వాఙ్మయ పత్రికను ప్రారంభించారు. సంస్కృతంలో ఉన్న సమస్త విజ్ఞానం, ముఖ్యంగా శాస్త్రగ్రంథాలు తెలుగులో రావాలనేది ఉమాకాంతం ఆశయం. పాణినీయానికి సరళ వివరణ పూర్వకమైన అనువాదం ఈ పత్రికలో ఆయన ప్రకటించారు. దర్శనాలు, సాహిత్య శాస్త్ర గ్రంథాలు వెలువడ్డాయి. కాని ఈ పత్రిక కూడ పూర్తిగా మూడేళ్లైనా వెలువడలేదు. 1924లో భారతి ప్రారంభమైంది. ఈ పత్రిక వెలువడడంతో తెలుగు సాహిత్య నవీన వికాస దశ ప్రారంభమైంది. సృజనాత్మక ప్రక్రియలన్నిటినీ ఆదరించడమే కాక చరిత్ర పరిశోధన, భాషా సాహిత్య పరిశోధనకు కూడా ప్రధానాధారమైంది. ఆరు దశాబ్దాలు వెలువడ్డ భారతి పత్రికలో ప్రసిద్ధ సృజనాత్మక రచయితలు, విమర్శకులు, పరిశోధకులు రచనలు వెలువరించారు.

1953లో తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రం వచ్చింది. ఇంకా విశాల ప్రాతిపదికన ఆంధ్రప్రదేశ ఆవిర్భావం కూడా కనుచూపు మేర దూరంలో కనపడుతున్నది. అప్పటికే నాలుగైదు దినపత్రికలు కూడా తెలుగు వారికున్నాయి. కొత్త విశ్వవిద్యాలయాలు స్థాపన కానున్నాయి. విద్యామాధ్యంగా, పరిపాలన భాషగా, విజ్ఞాన వాహకంగా, సామాజిక వికాస వర్ధకంగా తెలుగు భాష మరింత ప్రాధాన్యాన్ని సంతరించుకోనున్నది అని రామచంద్ర 'పరిశోధన' అనే పత్రికను ప్రారంభించారు. సంవత్సరానికి ఆరు సంచికల చొప్పున అంటే రెండు నెలలకొక సంచికగా ప్రకటించాలని సంకల్పించారు. తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు సహాయ సంపాదకులు. ఈ పత్రికలో కవిత్వం, కథ వంటి సృజనాత్మక ప్రక్రియలుండేవి కావు. 1954 ఏప్రిల్‌లో మొదటి సంచిక వెలువరించారు. దేశిరచనలు, సాహిత్య మీమాంస, తెలుగు తోబుట్టువులు, పురాతత్త్వం, ఛందస్సు, అలంకారం, అముద్రిత రచనలు, జానపద రీతులు, జనేతిహాసం మొదలైన వాటికి ప్రాధాన్యమిస్తూ ప్రతిసంచికలోనూ నూత్న విషయాలు ప్రకటించింది ఈ పత్రిక. అయినా సాహిత్య విద్యార్థి లోకంలో, పరిశోధకులలో ఆదరణ సముపార్జించుకోలేకపోయింది. ఆర్థికంగా ఒడిదొడుకులకు గురిఅయి మూడు సంవత్సరాలు కూడా పూర్తి కాకుండానే ఆగిపోయింది. ఈ పత్రిక ప్రారంభించే నాటికి రామచంద్ర వయసు నలభై సంవత్సరాలే. ఉత్సాహానికీ ఉపజ్ఞకూ పరిశ్రమకూ పరిశోధనకూ ఆయనలో కొదువ లేదు. కాని వ్యాపార దక్షత లేదు. అందుకే ఆ పత్రిక నడవలేదు. అయితే ఈ పత్రిక చిరస్మరణీయమైన మహాత్కార్యం సాధించింది. అదేమంటే తెలుగు సాహిత్యంలో నూతన రీతులను ప్రవేశపెట్టిన మహామహుల గూర్చిన ప్రత్యేక సంచికలు ప్రకటించింది. భారతదేశంలో అప్పుడు బుద్ధభగవానుడి ద్విసహస్ర పంచశతి జయంతి ఉత్సవాలు

జరుగుతుండడంతో బుద్ధజయంతి సంచిక ప్రచురించింది. అప్పటి వరకు తెలుగు సాహిత్యంలో బౌద్ధ వాఙ్మయ కృషికి ప్రాతినిధ్యం వహించేంత సుందరంగా ఈ సంచిక వచ్చింది. ఇదేవిధంగా పాల్కురికి సోమనాథుడు, గురజాడ అప్పారావు, ధర్మవరం కృష్ణమాచార్యులు, వేటూరి ప్రభాకరశాస్త్రి గారల ప్రత్యేక సంచికలు వచ్చాయి.

శ్రీ కృష్ణదేవరాయల తల్లి అయిన నాగమ్మ పేరిట నెలకొన్న నాగలాపురం గూర్చి రామచంద్ర పరిశోధన చేసి వెలువరించిన గ్రంథం ఎంతో విశిష్టమైనది. తెలుగునాట మరే చారిత్రక ప్రసిద్ధి వహించిన ప్రాంతం గురించి ఇంత గొప్ప గ్రంథం రాలేదు. ఇక్కడి క్షేత్ర దైవం వేదనారాయణస్వామి. ఈ రచన ఒక నవల కన్నా ఆకర్షకంగా చదివిస్తుంది. ఈ రచన కోసం కృష్ణదేవరాయల శాసనాలన్నీ పరిశోధించి అపూర్వమైన విషయాలు వెలికి తీశారు రామచంద్ర. దేవాలయ వాస్తు శిల్పం, పురాతత్త్వ విజ్ఞానం గూర్చి ఎన్నో అపూర్వ విషయాలు తెలిపారు.

నాగలాపురంలో వేదనారాయణస్వామికి నిత్యార్చనలలో తైలాభిషేకం చేస్తారు. కాని జలాభిషేకం, క్షీరాభిషేకం ఉండవు. ఇందుకు కారణం మూలబేరం (మూల విరాట్టు) అర్చామూర్తి సుధామూర్తి, అంటే సున్నపురాయి ప్రతిమ అని రామచంద్ర కారణం కనుక్కున్నారు. అట్లానే దేవాలయ శిల్పాలలో మకర తోరణాలు, మకర లతాకల్పనలు ఉండటానికి కారణాలు వివరించారు. 'కంచిలోనూ, నాగలాపురంలోనూ, రామగిరిలోను బల్లుల శిల్పాలు, వాటికి పూజలు చూడగానే 'ఇది అతి ప్రాచీనమైన సరీసృప పూజా చిహ్నంగా కనిపిస్తుంది. సరీసృప పూజలో ఒక్క నాగపూజే మనకు దేశమంతటా మిగిలింది. సరీసృపాలు అతి ప్రాచీనమైన ప్రాణులు. రాక్షస సరీసృపాలు (డైనోసార్స్) పూర్వం ఉండేవనీ వాటి అస్థిపంజరాలు శిలాజాలుగా రూపొంది దొరికాయని పురాతత్త్వవేత్తలు అంటున్నారు. ఆ భయంకర సరీసృపాలు తమకేమీ హాని చేయకుండా పూజించే ఆచారం పూర్వం ఉండి ఉంటుంది. దాని అవశేషమే బల్లుల శిల్పాలనీ, మకర శిల్పాలనీ' రామచంద్ర ఊహించారు. 'ఇండియన్ యాంటిక్వరీ'లో ప్రచురితమైన శ్రీ కృష్ణరాయల శాసనాలన్నీ పరిశీలించి ఈ గ్రంథం కూర్చారు రామచంద్ర. ఈ ఆధునిక కాలానికి పర్యాటక ప్రాధాన్యం ఏ విధంగా నాగలాపురం పరిసరాలైన రామగిరి, కైలాసనాథకోన సంపాదించుకుంటున్నదీ అక్కడి జ్ఞాన ధ్యానయోగ కేంద్రాల నే విధంగా నిర్వహిస్తున్నదీ కూడా రామచంద్ర వివరించారు.

ఏదైనా ఒక విషయంలో ఆయనకు జిజ్ఞాస ఎదురవుతే సంతృప్తికరమైన సమన్వయం, సమాధానం లభించిందాకా పరిశ్రమిస్తారు రామచంద్ర. అందువల్లనే ఆయనలో మౌలికమైన ఉపజ్ఞ, గవేషణ అంతగా కుదురుకున్నాయి.

ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధంలో తెలుగునాట నాటకరంగంలో యడవల్లి

సూర్యనారాయణ చాలా ప్రసిద్ధులు. మహారాజ పాత్రలో ఈయన అద్వితీయంగా నటించేవారు. రామచంద్ర నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో చదువుతుండగా (1930) నెల్లూరులో ఒకసారి కాళిదాస సంస్కృత శాకుంతలం ప్రదర్శితమైంది. యడవల్లి వారు గొప్ప నటులనీ, సంస్కృత శ్లోకాలు, వాటి స్థానీయాలైన తెలుగు పద్యాలు పరమశ్రావ్యంగా చదువుతారనీ, తమకు శాకుంతలం ఎలాగూ పాఠ్యగ్రంథం కూడా కనుకనూ, సంస్కృత కళాశాల విద్యార్థులు ఆ నాటకం చూడటానికి వెళ్లారు. యడవల్లి వారి శారీరానికి ముగ్ధులైపోయారు. సంగీత శాస్త్రానికీ నాట్యశాస్త్రానికీ అనుగుణంగా యడవల్లి వారు శ్లోకాలు, పద్యాలూ ఎలా చదువుతున్నారా( ?) అని శాకుంతలానికి సంస్కృతంలో వచ్చిన వ్యాఖ్యానాలన్నిటినీ, ఈ యా శ్లోకాలు పాడేటప్పుడు రాగ నిర్దేశం ఏమైనా ఉందా అని పరిశీలించారట రామచంద్ర. రాఘవభట్టు, వైఖానస శ్రీనివాసాచార్యుడు, కాటయవేముడు, మల్లినాథుడు మొదలైన వారి వ్యాఖ్యానాలు వేటిలోనూ రాగం గూర్చిన ప్రసక్తి లేనే లేదు. శాకుంతలం కాకపోయినా కాళిదాసు తక్కిన నాటకాలలోనైనా వ్యాఖ్యానాలలో సంగీతం గూర్చి చెప్పారా అని విక్రమోర్వశీయం మొదలైన వాటి వ్యాఖ్యానాలు చూశారట. శ్రీ హర్షుడి నాగానందం, ప్రియదర్శికల వ్యాఖ్యలు కూడా చూశారుట. పోనీ తెలుగు యక్షగానాలలో ఏమైనా ఉంటుందేమోనని అటువంటి సమాచారం కోసం వెతికారుట. అక్కడా ఆయనకు ఏమీ సమాచారం లభించలేదు. పోనీ ఆయా రాగాలు పాడవలసిన ఋతువులు, దేశకాల సన్నివేశాలు సంగీత శాస్త్రగ్రంథాలలో నిర్దేశితమై ఉండవచ్చునని శివతత్త్వరత్నాకరం, రాగవిబోధం, సంగీత సమయసారం, సంగీత దర్పణం, సంగీత పారిజాతం మొదలైన సంగీత శాస్త్ర గ్రంథాలన్నీ శోధించారుట. అప్పుడు ఏయే రాగాలు, ఏయే సమయాలలో, ఏయే సందర్భాలలో పాడాలో వ్యాఖ్యాతలు సూచించినట్లు తెలిసి, కాళిదాసు శాకుంతలం చతుర్థాంకంలోని 'కింశీతలై' (చల్లనివై శ్రమంబడపజాలిన) అనే శ్లోకం కన్నడ రాగంలో యడవల్లి వారు ఎందుకు చదివారో తెలిసి చాలా ఆనందించానని 'పద్యాలకు రాగాల నిర్దేశం' అనే వ్యాసంలో రామచంద్ర రాశారు. (సాహితీ సుగతుని స్వగతం – వ్యాస సంపుటి)

సంస్కృతంలోని 'కలంజం' అనే పదానికి అన్ని నిఘంటువులలోనూ మానియర్ విలియమ్స్ సంస్కృత – ఇంగ్లీషు నిఘంటువులోనూ, బృహత్ హిందీ కోశంలోనూ 'పొగాకు' అని అర్థం ఇచ్చారనీ కాని అది సరికాదనీ కలంజమంటే గంజాయి అనీ గంజాయి పొగ పీల్చడం, నమలడం బుద్ధుడి కాలానికి ముందు నుంచే భారతదేశంలో ఉందనీ, ఔషధంగా సేవించవచ్చని బుద్ధుడు కూడా సమ్మతించాడని వినయ పిటకంలో ఉందని రామచంద్ర 'బుద్ధుడికి ముందు కాలం నుంచే ధూమపానం' అనే వ్యాసంలో రాశారు.

శ్రీనాథుడి శృంగార నైషధ వ్యాఖ్యలో వేదం వారి పొరపాట్లు సవరించారు రామచంద్ర . సంస్కృతంలో ఇతర భాషా పదాలెన్నో చేరాయని కుమారిలభట్టు తంత్రవార్తికం నుంచి ఉదాహరించారు రామచంద్ర. తెలుగులో వచ్చిన మొదటి వ్యాకరణంపై (ఆంధ్ర భాషాభూషణం) అంతకు పూర్వమే చాలాకాలం కింద వచ్చిన కన్నడంలో మొదటి వ్యాకరణ ప్రభావం (కర్ణాటక భాషాభూషణం) ఎంత ఉందో చూపారు. శిల్పం, సంగీతం, సాహిత్యశాస్త్రాలు లోతుగా అధ్యయనం చేశారు రామచంద్ర.

# 11. విశిష్టరచనలు

పుస్తకరూపంలో వచ్చిన రామచంద్ర రచనలు అన్నీ విశిష్టమైనవే. చెప్పుకోదగినవే. ప్రత్యేకమైనవే. అవి పదిహేను, ఇరవై వరకూ ఉన్నాయి. రామచంద్ర రచనలన్నీ పుస్తక రూపంలో తెస్తే నూరు సంఖ్య దాటుతుంది. ఆయన గ్రంథాలన్నీ ప్రత్యేక విజ్ఞాన క్షేత్ర పరిశోధన ఫలితాలే. అంతకుముందు కాని, అటు తరువాత కాని తెలుగులో అటువంటి గ్రంథాలేమీ రాలేదు. వారు చెప్పిన విషయ సంబంధమైన వివరణలు కాని, విస్తరణానుబంధ జిజ్ఞాసలు కాని ఇతరులెవరూ కాని చేయలేదు. ఉదాహరణకు 'హిందువుల పండుగలు – పర్వములు' అనే గ్రంథాన్నే పేర్కొనవచ్చు. ఈ విషయాలను గూర్చి ఇక ఎవరికీ ఏమీ మిగలకుండా రాశారని విశ్వనాథ సత్యనారాయణ గారు తనను మెచ్చుకొన్నట్లు చెప్పుకొని రామచంద్ర మురిసి పోతుండేవారు. హిందువుల పండుగలను గూర్చి రామచంద్ర గారి కన్నా ముందే వచ్చిన సురవరం ప్రతాపరెడ్డి గారి గ్రంథం ఒకటి ఉంది కాని అది సమగ్రం కాదు. విషయసేకరణ సంపన్నం కాదు. వేల సంవత్సరాల నుంచి ఈ పండుగలు ఎందుకు ? ఎట్లా జరుపుకుంటున్నారో రామచంద్ర శాస్త్రీయంగానే అయినా సరళంగా వివరించారు. తెలుగులో, సంస్కృతంలో, హిందీలో, ఇంగ్లీషులో ఇందుకు సంబంధించి ఉన్న గ్రంథాలన్నీ చదివి విషయం పొందుపరిచామని రామచంద్ర చెప్పుకున్నారు. ఈ గ్రంథంలో హిందువులు పాటించే 30 పండుగలను గూర్చి చెపుతూ వాటికి సంబంధించిన ఖగోళ విజ్ఞానం, పురాణ ఆకరాలు చూపారు.

ఇట్లానే మూడు వాఙ్మయ శిఖరాలు అనే రచన కూడా తెలుగు భాషా సాహిత్య పరిశోధకాగ్రసరులైన ముగ్గురు మహనీయుల సాహిత్య జీవిత కృషి చిత్రణ. తెలుగులో తక్కిన ఆధునిక ప్రక్రియల మాదిరిగా జీవిత చరిత్ర రచన ప్రాచుర్యం వహించలేదు. గొప్ప వారి జీవితచరిత్రలు కాని, గొప్పగా రచించిన జీవిత చరిత్రలు కాని ప్రామాణికంగా, మార్గదర్శకంగా చూపగలిగినవి వేళ్లమీద లెక్కపెట్టటానికైనా తెలుగులో లేవు. ఇక సాహిత్య జీవిత చరిత్రలు చాలాచాలా తక్కువనే అనాలి. ఆధునిక కాలంలో గొప్ప రచయితలుగా ప్రసిద్ధులైన వారెవరూ కూడా జీవిత చరిత్ర రచన చేయకపోవడం వల్లనే ఈ ప్రక్రియలో ఎక్కువ కృషి జరగలేదని అనుకోవాలి.

ఈ సంపుటిలో మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, నిడుదవోలు వెంకటరావు గారల సాహిత్య కృషిని వివరించారు రామచంద్ర. ఆసక్తికరమైన విషయం ఏమంటే ఈ ముగ్గురు సాహిత్యవేత్తలను రామచంద్ర సన్నిహితంగా తెలిసిన వారు. వారితో కలిసి పనిచేసిన వారు. అందువల్లనే ఆత్మీయంగా అనేక విషయాలు రాయగలిగారు.

రామచంద్రకు జీవితంలో మొట్టమొదట పరిచయమైన గొప్ప సాహితీవేత్త మానవల్లి రామకృష్ణ కవి. నిజానికి 20వ శతాబ్ది భారతదేశ సాహిత్య పరిశోధకులలోనే రామకృష్ణ కవి గొప్పవాడు. భరతముని నాట్యశాస్త్రాన్ని ప్రచురించిన వాడాయన. అభినవ గుప్తుడి భరత శాస్త్ర వ్యాఖ్యానాన్ని ప్రచురించటమే కాక భరతకోశాన్ని కూడా రూపొందించిన వాడు. సంస్కృత ప్రాకృతాలలో గొప్ప పండితుడు. బరోడా గైక్వాడ్ గ్రంథాలయంలో పని చేసి దేశం మొత్తంలో నలభై ప్రతులు భరత నాట్యశాస్త్రాన్ని సేకరించి నాట్యశాస్త్రం ప్రకటించిన ఖ్యాతి ఆయనది. కాన్పూరులో ఒక సాహిత్య గోష్ఠిలో రాహుల్ సాంకృత్యాయన్, కె.పి. జయస్వాల్, లక్ష్మణ్ స్వరూప్ వంటి గొప్ప సాహిత్యవేత్తలు రామచంద్రను 'మానవల్లి' వారు తెలుసా ? అని అడిగి తెలియడమే కాదు వారితో పని చేశానని రామచంద్ర చెప్పినప్పుడు ఆ మహాపండితులు, వేత్తలు, పరిశోధకులు మానవల్లి వారిని గొప్పగా ప్రస్తుతించారనీ, అప్పుడు తమకు అతిమానుషానందం కలిగిందనీ రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. మద్రాసులో కొన్నాళ్లు రామంద్ర మానవల్లి వారికి తాళపత్ర గ్రంథ సంశోధనలో, పరిష్కరణంలో సహాయకుడుగా ఉన్నారు. వారిని రామచంద్ర తమ ఇంటనే ఉంచుకుని అన్నపానాదికాలు సమర్పించి ఆదరించారు. ఇక వేటూరి ప్రభాకరశాస్త్రి గారితో కలసి రామచంద్ర మూడు సంవత్సరాలు మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో పని చేశారు. వారి పరిశోధన కృషిలో తోడ్పడ్డారు. ప్రాచీన కావ్య పరిష్కరణకు అవసరమైన పాఠాంతరాలు సేకరించి ఇచ్చారు. ప్రభాకరశాస్త్రి గారి ఇల్లు ఒక సాహిత్య విద్యాలయంగానూ, యోగ విద్యాకేంద్రంగానూ ఉండేది. వారి కుటుంబ సభ్యులుగా రెండు సంవత్సరాలు సన్నిహితంగా మెలిగారు కాబట్టి శాస్త్రి గారి మూర్తిమత్వాన్ని చక్కగా రూపు కట్టించారు. రామచంద్ర గారు దర్శించిన మూడో వాఙ్మయ శిఖరం నిడుదవోలు వెంకటరావుగారు. వీరు మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖ ఆచార్యులుగా పని చేశారు. పరిశోధనాత్మకంగా తెలుగుకవుల చరిత్ర రచించారు. సాహిత్య విషయకమైన వీరి ధారణ అతిమానుషమైనది. పూర్వకావ్యాల నుంచి ఏ పదానికి, పద్యానికి ప్రయోగం కావాలన్నా సద్యఃస్ఫురణంగా చెప్పేవారు వెంకటరావుగారు. నిఘంటువు వారి జిహ్వాగ్రాన ఉండేది. ఒక్క చేతి మీద తెలుగు సాహిత్య పత్రికలలో వీరు వ్రాసినన్ని వ్యాసాలు

మరెవరూ రాయలేదు. విద్యారత్న, పరిశోధన పరమేశ్వర అనే బిరుదులున్నాయి నిడుదవోలు వారికి. దీనికి మూలాధారమైన వారి సాహిత్య అంతస్సత్వాన్ని రామచంద్ర ఈ రచనలో ఆవిష్కరించారు. సమకాలీన కవి పండితుల పట్ల తమ భక్తి ప్రపత్తుల నీవిధంగా రామచంద్ర వెల్లడించుకున్నారు.

రామచంద్ర రచించిన గ్రంథాలలో చెప్పుకోదగింది 'తెలుగు పత్రికల సాహిత్య సేవ' అనే గ్రంథం ఒకటి. ఈ విషయంలో వీరికన్న అధికారికంగా చెప్పగలిన వారు మరొకరు లేరు. గడచిన నూట ఏభై సంవత్సరాల తెలుగు పత్రికల సాహిత్య సేవనూ ఈ గ్రంథంలో వారు సమీక్షించారు. 1840 సం॥లలో తెలుగు వెలువడిన తొలి వార్తోదంత పత్రికలోని పాఠకుల లేఖలు కూడా ఉదాహరించారు. 1989లో తొలిసారి ప్రచురితమైన రామచంద్ర ఈ పుస్తకం మూడేళ్లలో రెండో ముద్రణ వచ్చింది. సుమారు 75 తెలుగు పత్రికల గూర్చిన సమాచార వివరణ ఉంది ఈ పుస్తకంలో. 20వ శతాబ్ది తొలి దశకంలోనే తెలుగులో దినపత్రిక ప్రచురణ ప్రారంభమైంది. ఈ గ్రంథం ద్వారా వార్తా సేకరణలో, వ్యాఖ్యానంలో, ప్రచురణ సమర్పణలో సాంకేతికంగా, సామాజిక స్ఫూర్తిదాయకంగా, రాజకీయ చైతన్య స్ఫోరకంగా ఎటువంటి వికాస పరిణామాలు దినపత్రికలలో చోటుచేసుకున్నాయో సమీక్షించారు. తెలుగులో సాహిత్య పత్రికలు మొదలు కాగానే పరిపుష్టమైన ఆధునిక ప్రక్రియ వ్యాసం కాబట్టి నూరునూట ఇరవై సంవత్సరాలుగా వ్యాసం ఎంతటి వైవిధ్యం పొందిందీ వివరించారు.

రామచంద్ర జీవితకాల సాహిత్య కృషినంతా ప్రతిబింబింప చేసినది 'సాహితీ సుగతుని స్వగతం' అనే వ్యాస సంకలనం. తెలుగునాట ప్రసిద్ధ సాహిత్య మాసపత్రిక 'భారతి'లో వారు నిర్వహించిన శీర్షిక ఇది. ఆయన సాగించిన సాహిత్యాధ్యయనపు ఎత్తులు, లోతులు, వారి ఉపజ్ఞ ఈ వ్యాసాలలో సమగ్రంగా ప్రతిఫలిస్తాయి. ఈ వ్యాసాలలోని రామచంద్ర విజ్ఞాన వైవిధ్యం, విస్తార ప్రతిభ ఆశ్చర్యం గొలుపుతాయి. తెలుగునాట చాలా ప్రాచుర్యం పొందిన దేశీయ వినోద, విజ్ఞానదాయక కాలక్షేపాలలో బుర్రకథ ఒకటి. బుర్ర అంటే ఏకతార వంటి సంగీత సాధనం. దానిని మీటుతూ వంతగా పాడే ఇద్దరితో కలిసి ప్రధాన కథకుడు గేయరూపంగా వీరగాథాత్మకమో, కరుణ రసప్లావితమో, దేశభక్త్యుద్దీపకమో అయిన ఒక కథను గానం చేయడమే ఈ సంగీత ప్రక్రియ విశిష్టత. ఈ ప్రక్రియ పుట్టుపూర్వోత్తరాలను విశ్లేషిస్తూ 'తెలుగు జాతి ప్రాచీన సంగీత రూపాలైన బుర్రకథ' అని దాక్షిణాత్య భాషల తులనాత్మక ఆధారాల ద్వారా వివరించారు రామచంద్ర. పూర్వ కావ్యాలను విశ్లేషించి సామాజిక చరిత్రను సేకరించారు. ఆధునిక తెలుగు సాహిత్యంలో 'ఏకాంకిక' అనే ప్రక్రియ ఏ విధంగా రూపుదిద్దుకొన్నదీ చెప్పారు. ఆధునిక సాహిత్యంపై పాశ్చాత్య కవుల

ప్రభావం భావచిత్రం, అని ఇంకో వ్యాసంలో వివరించారు. భావచిత్రణ అంటే 'ఇమేజరీ' తెలుగులో నవకవులు ఏ విధంగా ప్రవేశపెట్టిందీ నిరూపించారు. సాంస్కృతిక సామాజిక వ్యవహారపరంగా 'నూరు, నూట ఎనిమిది, నూట పదహారు' సంఖ్యకుండే ప్రాధాన్యమేమిటో, ఆ ప్రాముఖ్యం కలగడానికి కారణాలేవై ఉండవచ్చునో ఒక వ్యాసంలో వివరించారు. ఆగ్నేసియాలోని వలస రాజ్యాలలో అమరావతి స్థూప ప్రభావం ఏ విధంగా రూపుదిద్దుకుందో ఒక వ్యాసంలో వివరించారు. ఈ సంపుటిలోనే మానవ జీవిత వికాసానికీ, నాగరకతకూ కళలూ – శాస్త్రాలూ ఏవి ముఖ్యం ? అని అత్యంతాసక్తిదాయకంగా, భావుకంగా చర్చించారు ఒక వ్యాసంలో. అన్నమాచార్యుల సాహిత్య సంగీత ప్రతిభ, ప్రజ్ఞను గూర్చి ఒక వ్యాసంలో వివరించారు. ఇవన్నీ కాక ఆఫ్రికా కవుల తత్త్వ చింతన గూర్చీ, ఈజిప్టు ప్రజల ఆముష్మిక చింతనను గూర్చి రామచంద్ర హృద్యమైన సమాచారాన్ని భారతి పత్రికలోనే వెలువరించి ఈ వ్యాస సంకలనంలో చేర్చారు. వేదం వెంకటరాయశాస్త్రి పాండిత్యం, వ్యాఖ్యాన ప్రతిభ ఒక వ్యాసంలో సమీక్షించారు. ధర్మవరం కృష్ణమాచార్యుల వారి నాటక రచన ప్రతిభను వివరించారు.

రామచంద్ర గ్రంథాలన్నిటిలోనూ గొప్ప పేరు ప్రఖ్యాతులు ఆయనకు సముపార్జించినది 'మన లిపి – పుట్టుపూర్వోత్తరాలు' అనే రచన. భారత దేశంలో లిపి ప్రాదుర్భావం ఏ విధంగా జరిగిందీ, రెండువేల సంవత్సరాలలో ఏ విధమైన పరిణామాలు పొందిందీ ఈ గ్రంథంలో వివరించారు రామచంద్ర. శాసనాలలో ఆయా కాలాలలో ఈ లిపి ఏ విధంగా మార్పు చెందుతూ వచ్చిందీ అక్షరాకృతుల చిత్రాలతో విశదీకరించారు. భారతదేశంలో సకల భాషా లిపులకు బ్రాహ్మీలిపియే మాతృక అనీ, దక్షిణాది లిపులు కూడా బ్రాహ్మీలిపి భేదాలేనని రామచంద్ర ప్రతిపాదన. సాజాత్య భాషలు కొన్ని ఏ కాలం దాకా ఏకలిపి స్వరూపాల్ని పాటించాయో కూడా చూపారు.

ఇటు తర్వాత ఆయన పుస్తకాలలో పేర్కొనవలసింది 'నుడి – నానుడి' అనే శీర్షికతో వెలువడింది. కొన్ని దేశి పదాల పుట్టుపూర్వోత్తరాలు ప్రతిభా సమన్వితంగా చర్చించారిందులో. దిక్కులను తెలిపే పదాలు తెలుగులో తూర్పు, పడమరలుండి, ఉత్తరదక్షిణాలను తెలిపే పదాలు ఎందుకు లేవు ? ఉండి ఉంటే అవి ఏవై ఉంటాయి. కందులు అనే పేరు ఆ కాయధాన్య విశేషంగా ఎందుకు వాడు లోకి వచ్చింది వంటి విశేషాసక్తికరమైన చర్చలు చేశారు.

బౌద్ధ జైన వాఙ్మయాలను గూర్చీ, ప్రాకృత సాహిత్యం గూర్చీ వారు చేసిన కృషి అపూర్వం. ఈ విషయాలకు సంబంధించిన రచనలు వారివి పది దాకా పుస్తక రూపంలో వచ్చాయి. తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన లలిత

కళల విజ్ఞాన సర్వస్వంలో రామచంద్ర సంపాదకవర్గ బాధ్యతలు నిర్వర్తించారు. కన్నడం నుంచి మలయాళం నుంచి, తమిళం నుంచి చాలా గ్రంథాలు అనువదించారు. ప్రాచ్య భాషా పండితుల వార్షిక సదస్సులకు, సమావేశాలకు తప్పక వారు హాజరవుతూ పరిశోధన పత్రాలు సమర్పించేవారు. ఆయుర్వేద విజ్ఞాన విషయకమైన వ్యాసాలు కూడా రామచంద్ర చాలా వరకు రచించారు. 'ఆయుర్వేదంలో ప్రజనన తంత్రం', 'పాల్కురికి సోమనాథుడి ఆయుర్వేద వైదుష్యం' లాంటి రచనలు చేశారు రామచంద్ర.

ఇన్ని విషయాలలో ప్రజ్ఞ గల వారు ఏ కాలంలోనైన సాహిత్య పరులలో అరుదు.

---

# 12. బౌద్ధ-జైన వాఙ్మయకృషి

'బుద్ధుడు వేదజ్ఞుడని, సకల శాస్త్రజ్ఞుడని, పిటకాలు ఘోషిస్తున్నాయి. లలిత విస్తరం వర్ణిస్తున్నది. ఇలాంటి వేదవేత్త ప్రపంచంలోనే తొలి విజ్ఞాన భండారమూ, మానవ సమాజోద్ధారకమూ అయిన వేదాన్ని నిరసిస్తాడా ? అతడు నిరసించింది కామ్యకర్మల కోసం పశు విశసనాది హింసను, ఆ కాలానికి ముందు నుంచి ఆరంభమై తన కాలంలో సంఘపతనానికి కారణమైన కర్మకాండను మాత్రమేనని, మానవుని ఉన్నతికి చేర్చే ఇతరాంశాలన్నిటినీ గ్రహించి, తన పరిసర భాషలో ప్రజాసామాన్యానికి ఉపదేశించాడని హృదయపూర్వకంగా నమ్మే వారిలో నేనొకణ్ణి' అని శ్రీ రత్నాకరం బాలరాజు గారి 'ధమ్మపదం' ఆంధ్రానువాదానికి పరిచయ వాక్యాలు రాస్తూ రామచంద్ర అన్నారు.

కలియుగంలో ప్రభవించిన యోగులలో చక్రవర్తి బుద్ధుడని శంకరాచార్యుల వారు దశావతార స్తోత్రంలో బుద్ధుణ్ని స్తవించిన వైనం కూడా ఉదాహరించారు రామచంద్ర. రామచంద్ర సాహిత్య, సామాజిక, సాంస్కృతిక సంవేదనలలో ఆయనకు బౌద్ధ దర్శనంపై మక్కువ ఎక్కువ అనిపిస్తుంది. ప్రాకృత, పాలీ సాహిత్యాలలో ఆయన కృషి కూడా ఇందుకు దోహదం చేసి ఉంటుంది. అదీకాక తెలుగు వారికి బౌద్ధమతంతోనూ, జైనమతంతోనూ అత్యంతసన్నిహిత సంబంధం ఉండేదనీ తెలుగు వారు ఈ రెండు మత దర్శనాలను చాలా ఆదరించారనీ రామచంద్ర విశ్వాసం. బౌద్ధ దర్శనంలో అత్యంత ప్రాముఖ్యం పొందిన వజ్రయానం తెలుగునాటనే పుట్టిందనీ, వర్ధిల్లిందనీ బౌద్ధ వాఙ్మయ దార్శనికుల అభిప్రాయం. బౌద్ధ దర్శనంలో అత్యంత ప్రాచుర్యం పొందిన యోగాచార సంప్రదాయం సుప్రతిష్ఠితం చేసిన ధర్మకీర్తి కూడా ఆంధ్రుడేననీ ఈయనకు కుమారిలభట్టు మేనల్లుడనీ, ధర్మకీర్తి తర్కశాస్త్రంలో మహాపండితుడనీ, ఈయన వాదన్యాయంలో తెలుగు పదాలు కన్పిస్తున్నాయనీ ప్రొఫెసర్ పి.ఎస్. శాస్త్రి గారు 'మహాయాన దర్శనములు' అనే గ్రంథంలో రాశారు. అంతే కాదు, 'ధాన్యకటకం' దగ్గరనే బౌద్ధులలో వజ్రయానం బయలుదేరిందనీ, జ్ఞానోదయం అయిన తర్వాత పదహారు సంవత్సరాలకు బుద్ధుడు ధాన్యకటకానికి వచ్చాడనీ, ఆయనే అక్కడ వజ్రయానాన్ని ప్రవర్తింపచేసి మూడవ ధర్మచక్రాన్ని ప్రవర్తింపచేశాడని కూడా టిబెట్ దేశపు బౌద్ధ గ్రంథ ఆధారాలతో శాస్త్రిగారు

అభిప్రాయపడ్డారు. 'ఇట్టి దర్శనానికి ఆంధ్ర దేశమే పుట్టిల్లు' అని కూడా వారన్నారు. బుద్ధుడికి జ్ఞానోదయం అయిన తర్వాత ఆయన బోధించిన మొదటి ఐదుగురి శిష్యులలో కొండన్న అనే తెలుగు వ్యక్తి ఉన్నాడనీ, బుద్ధ భగవానుడు తెలుగునాట భట్టిప్రోలు ప్రాంతంలో పర్యటించారనీ కూడా శాస్త్రిగారు తమ గ్రంథానికి పరిచయం రాస్తూ చెప్పారు. ఏమైనా బుద్ధుడికీ, తెలుగునాడుకూ చాలా దగ్గర సంబంధం ఉందని బౌద్ధ వాఙ్మయవేత్తలు భావిస్తున్నారు. అందువల్ల రామచంద్ర కూడా క్రీ. పూర్వం, క్రీ. వెనుక బౌద్ధమతంతో ఆంధ్రదేశానికున్న సంబంధం గూర్చి విశేషాసక్తితో కృషి చేశారు. బుద్ధ దర్శనం పట్ల రామచంద్రకు అడవి బాపిరాజు గారి వల్ల కూడా కుతూహలం మరింత వృద్ధి అయి ఉండే అవకాశం ఉంది. బౌద్ధమతాన్ని గూర్చి, బౌద్ధమత చారిత్రక వికాసాన్ని గూర్చి బాపిరాజుగారి కృషి అద్వితీయమని రామచంద్ర గారు అంటూ ఉండేవారు. తెలుగు విశ్వవిద్యాలయం వారు చేపట్టాలని అభిలషించే కొత్త పథకాలకు, ప్రాజెక్టులకు రామచంద్ర ఒక నివేదిక సమర్పించారు. ఇందులో వారు బౌద్ధ, జైన వాఙ్మయం తెలుగు వారి సమాజంపై, సాహిత్యంపై ఏవిధంగా ప్రభావం చూపిందో అధ్యయన కార్యక్రమాలు చేపట్టాలని సూచించారు. వారి మాటలలోనే చెప్పాలంటే 'తెలుగు, ప్రాకృతాల సంబంధం యీనాటిది కాదు. ఇరవై ఐదు శతాబ్దాల నాటిది. గౌతమ బుద్ధుడు తథాగతుడు కాగానే ఆ వార్త తెలిసిన తెలుగు వారు బోధన్, జార్ఖండ్‌ల మీదుగా బీహారుకు, వారణాసికి వెళ్లి ఆయనను కలుసుకొని ఉపదేశాలు పొంది, ఆయన చిత్రపటాలు కూడా తీసుకొని వచ్చినట్టు జాతక కథలలో ఉంది.

అట్లాగే జైన మతంతో మనకు సంబంధం ఏర్పడింది. అనంతపురం జిల్లా కొండగుంత వాస్తవ్యుడైన కొండకుంతాచార్యుడు ఉత్తరాపురానికి వెళ్లి గొప్ప జైనాచార్యుడయ్యాడని చరిత్ర చెపుతున్నది. ఇతడు క్రీ.శ. ఒకటవ శతాబ్దం వాడు. ఇంకా ఎందరో తెలుగు వారు జైనాచార్యులయ్యారు. తెలుగుదేశంలో బౌద్ధ క్షేత్రాలు వెలసినట్లే జైన క్షేత్రాలు వెలిశాయి. ఇవి నేటికీ కొన్ని పూజా పురస్కారాలు పొందుతున్నాయి.

ఈ రెండు మతాల ద్వారా తెలుగుకు ప్రాకృతాలతో అత్యంత ఘనిష్ఠ సంబంధం ఏర్పడింది. కారణం తథాగతుడు, మహావీరుడు ప్రజాభాషలయిన ప్రాకృతాలలో ఉపదేశించడమే. బౌద్ధమతం మన (తెలుగు) సాహిత్యాన్ని అంతగా ప్రభావితం చేయకపోయినా భాషను చాలా ప్రభావితం చేసింది. కొన్ని వందల పాలీ ప్రాకృతపదాలు తెలుగులో చేరిపోయాయి.

'మనం వాల్మీకి రామాయణాన్నే ప్రామాణికమని విశ్వసిస్తున్నాము. తెలుగు సాహిత్యంలోని అవాల్మీకమైన ఉపకథలకన్నిటికీ చాలా వరకు మూలం జైన

రామాయణాలు. జైనులు భారత, భాగవత, రామాయణ, హరివంశాదులను తమ మతానుసారంగా రాసుకున్నారు. తామే నిజమైన ఇతిహాసాలను చెబుతున్నామని కూడా చెప్పుకున్నారు. కాని మూలపాత్రలకు అవమానకరమైన కథలేవీ వారు అంటగట్టలేదు' అని ఆ నివేదికలో రామచంద్ర రాశారు.

బౌద్ధ సాహిత్యం కూడా తెలుగులో కొంత చేరింది కాని బౌద్ధమత ప్రధాన గ్రంథాలైన త్రిపిటకాలు తెలుగులో యథాతథంగా అనువాదం కావాలని అభిలషించారు రామచంద్ర. దీనివల్ల నైతిక, సాంఘిక, ఆధ్యాత్మిక, భాషా, చరిత్ర, భౌగోళిక విషయాలు ఎన్నో తెలుస్తాయి. తెలుగు సాహిత్యం సుసంపన్నమవుతుంది అని కూడా అభిప్రాయపడ్డారు. ఇదే విధంగా జైన సాహిత్యం తెలుగులో రావాలి. ఇందువల్ల రామాయణ కథల ఉపకథలు ఎక్కడివో తెలుస్తాయి. జైన రామాయణంలో మూడు సంప్రదాయాలున్నాయి. 1. విమల సూరి సంప్రదాయం, 2. సంఘదాస సంప్రదాయం, 3. గుణభద్ర సంప్రదాయం. వీటిలో ప్రధానంగా విమల సూరి సంప్రదాయమే వ్యాప్తిలోకి వచ్చింది. లోకప్రియమైన రామకథను జైనధర్మపు మూసలో దించడానికి మొదటి ప్రయత్నం విమలసూరిదే. ఈయనను తరువాత ప్రాకృత, సంస్కృత కవులు కూడా అనుసరించారు. ఈ విమలసూరి క్రీ.శ. 1వ శతాబ్దం వాడు. విమల సూరి రామాయణం పేరు ప్రాకృతంలో 'ప ఉమాచరియ'. అది పద్మ చరితం. రాముడి వదనం, హృదయం, పాదాలు, చేతులు పద్మాల వంటివి కనుక రాముణ్ణి 'పద్మ జ' అన్నాడు విమలసూరి. కన్నడంలో ఆదికవి అయిన పంపమహాకవి తెలుగులో పద్మ పురాణం రచించినట్లు ప్రతీతి. పద్మపురాణంలోని వంటూ మానవల్లి రామకృష్ణ కవిగారు కొన్ని పద్యాలుదాహరించారని రామచంద్ర రాశారు. పద్మ చరితం నూట యాభైఎనిమిది పర్వాల గ్రంథమనీ, దీని హిందీ అనువాదం కూడా లభ్యమవుతుందనీ తెలుగులో వ్యావహారిక భాషలో అనువదించడం కోరుకోదగినదని రామచంద్ర సూచించారు.

బౌద్ధ, జైన సాహిత్యం పట్ల రామచంద్రకున్న అభిమానమే ఆయన ప్రాకృత సాహిత్యంలో గొప్ప కృషి చేయడానికి కారణమైంది. హాలగాథాసప్తశతిని గూర్చి రామచంద్ర సమగ్రమైన కృషి చేశారు. 500 గాథలను ప్రాకృతంలోనే ఉద్ధరించి వాటి తెలుగు అనువాదం కూర్చారు. 'హాల గాథాసప్తశతి'లో తెలుగు పదాలని రామచంద్ర ఒక గ్రంథమే రాశారు. లీలావతి కథ ప్రాకృత కావ్యమనీ ఇందులో 1300 ఆర్యలున్నాయనీ సాతవాహన చక్రవర్తి హాలుడు, సింహళ రాజకుమార్తెను వలచి ఉద్వాహం కావడం ఈ కావ్య ఇతివృత్తమనీ ఈ కావ్యంలో తెలుగునాటి సప్తగోదావరి ప్రశంస ఉందని కూడా రామచంద్ర చెప్పారు. తెలుగు భాషతో ప్రాకృతానికి ఉన్న సంబంధం తెలిపే ప్రాకృత భాషా వాఙ్మయం చరిత్ర సంధానిస్తే

బాగుంటుందన్నారు. ప్రాకృతం నేర్చుకొనే వాచక పుస్తకాలు తెలుగు వారికి కావాలని రామచంద్ర అభిలాష. భండార్కర్ సంస్కృత బోధినులు లాగానే ప్రాకృత భాషాబోధినులు, అనువాద ఖండ అభ్యాసికలతో రూపొందించాలని రామచంద్ర అభిమతం. రామచంద్ర జీవితకాలం చరమదశలో హైదరాబాదులో తెలుగు విశ్వవిద్యాలయ నిర్వహణలో ప్రాకృతం బోధించే సాయంకాలం తరగతులు కూడా నిర్వహించారు. తెలుగు ప్రాకృతాల సంబంధం అనే వ్యాసంలో తెలుగు భాషా సంబంధమైన ప్రాకృత పదాలు 500 చూపారు రామచంద్ర. బెంగళూరులో 1990వ సంవత్సరంలో జరిగిన తెలుగు మహాసభలలో ఈ పరిశోధన పత్రం సమర్పించారు. ఒక్క హాల గాథాసప్తశతిలోనే తెలుగు పదాలు కావచ్చునని నూరు పదాలు చూపారు. అట్లానే క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందిన వజ్జాలగ్గమనే ప్రాకృత భాషాకావ్య సంకలనంలో 24 తెలుగు పదాలు ప్రాకృత వేషం ధరించి ఉన్నాయని పట్టీకరించారు. రామచంద్ర ప్రాకృత వాఙ్మయ కృషి ఎంత ఘనిష్ఠమైనదో 'ప్రాకృత వాఙ్మయంలో రామకథ' అనే ఆయన గ్రంథం ద్వారా తెలుస్తుంది. ప్రాకృత సాహిత్యంలో సామాన్య మానవుడు అనే వ్యాసం వారు 1974 నాటికే భారతిలో ప్రకటించారు. హాలుడి గాథాసప్తశతి భావాలను నేటి కథాశిల్పంతో 50 దాకా పరివర్తించారు.

బౌద్ధ వాఙ్మయాన్ని తెలుగు వారికి పరిచయం చేసిన రామచంద్ర ప్రకృష్ట కృషి 'లలితవిస్తరమ'నే మహాయాన బౌద్ధప్రామాణిక తథాగత పురాణాన్ని తెలుగులోకి అనువదించడం. ఆధునిక భారతీయ భాషలలో తొట్టతొలుతగా 'లలిత విస్తరం' వెలువడడం రామచంద్ర గొప్ప కృషికి తార్కాణం. ఈ కృషిలో వీరికి బులుసు వెంకట రమణయ్యగారు తోడ్పడ్డారు. ఈ గ్రంథం సింహళంలో లభించింది. 1972లో ఇది మొదటిసారి ముద్రణ పొందింది. తమ జీవితకాలంలో ఇది మళ్లీ ముద్రణ పొందాలని రామచంద్ర సన్నిహితులతో ఎంతో తమకంగా ప్రసంగించేవారు. బౌద్ధ జాతక కథా సంబంధి అయిన అవదాన కల్పలతను కూడా రామచంద్ర తెనిగించారు. ఇది క్షేమేంద్రుడి రచన. ఈ గ్రంథం కూడా భారత దేశంలో లభించలేదు. బర్మాలో దొరికింది. రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారు ప్రచురించారు. కొన్ని కథలు లుప్తం కాగా క్షేమేంద్రుడి కుమారుడు సోమదేవుడు పూరించినట్లు పరిచయ వాక్యాలలో ఆ సోమదేవుడే రాసుకున్నాడు. ప్రాకృత వాఙ్మయంలో గోదావరి నది సౌందర్య వర్ణన గూర్చి రామచంద్ర ఒక వ్యాసంలో చెప్పారు.

'ప్రాకృతంతో తెలుగు వారికి గల సంబంధం దాదాపు మూడు సహస్రాబ్దాల నాటిది. మనకు బౌద్ధ, జైనాలతో కలిగిన ఘనిష్ఠ సంబంధంతో తెలుగు, ప్రాకృతాల మధ్య పరస్పర ఆదాన ప్రదానాలు జరిగాయి. ఈ భాషలు రెండు జన్య జనక సంబంధం కలవేమో అన్నంతగా కలిసిపోయాయి' అని ప్రాకృత వాఙ్మయాన్ని

గూర్చిన తమ వ్యాస సంపుటి పరిచయ వాక్యాలలో రామచంద్ర రాశారు. సుమారు 60 సంవత్సరాలు అంటే 1935లో మొదలుపెట్టి ప్రాకృత సాహిత్య అధ్యయనం సాగిస్తూనే వచ్చారు రామచంద్ర. ప్రవర సేనుడి సేతుబంధకావ్యాన్ని తమ మిత్రులు కుంటిమద్ది శేషశర్మ గారు అనువదించగా దానికి ప్రశస్తమైన పరిచయం రాశారు రామచంద్ర.

రామచంద్ర సాగించిన, సాధించిన సమస్త సాహిత్య పరిశ్రమలో ఒక ఉపనదిగా ప్రాకృత సాహిత్య పరిశోధన ప్రవాహం ఉంటూనే వచ్చింది.

# 13. వృత్తి - ప్రవృత్తి

చాలామంది జీవితాలలో జీవిక కోసం వృత్తి కాని, వృత్తి కోసమే జీవిక సంభవించదు. తమకు ఆసక్తికరము, ఉత్తేజకరమూ అయిన వృత్తి చాలామంది జీవితాలలో లభించదు. అలా తాను కోరుకున్న వృత్తినే తాను అవలంబించగలగడం చాలా అరుదు. దానినే వృత్తి సంతృప్తి అంటారు. పేరుప్రతిష్ఠలు, డబ్బు, హోదా, పదవులు, బిరుదులు రాకపోయినా రామచంద్ర వృత్తి సంతృప్తిని మాత్రం పూర్తిగా పొందగలిగారు. అందువల్లనేనేమో ఆయన ఎప్పుడూ ఉల్లాసంగానే కనిపించేవారు. ఎవరిపై ఎటువంటి అభియోగాలు కాని, అసంతృప్తులు కాని, ఆయన ఏ మాత్రం వ్యక్తం చేసేవారు కాదు. ఆశావహమైన రేపటినే ఎప్పుడూ భావించేవారు. ఇతరులకూ అటువంటి స్వాస్థ్యత పట్లనే అభిరుచి కలిగించేవారు. విసుగు, వేసట, వేదన ఎప్పుడూ వారికి దూరంగానే ఉండేవి. ప్రతిరోజూ ఆయనకు చేతి నిండా పని ఉండేది కనుక గతాన్ని గూర్చి ఆగతాన్ని గూర్చి ఆయనకు ఆలోచనే ఉండేదు కాదేమో ! ఎనభై ఏళ్ల వయసున కూడా ఆయన విశ్రాంతి, విరామం ఎరుగరు. ఎప్పుడూ ఏదో పని ఉంటూ ఉండేది. ఎవరి పుస్తకానికైనా ఉపోద్ఘాతం రాయడం, ఏ పత్రిక వారికైన వ్యాసం రాయడమో, అభినందన సంచికకు రచన అందించడమో ఇటువంటి పనిలో ఆయన నిమగ్నమై ఉండేవారు.

పత్రికా రంగంలో ఇరవైయ్యో శతాబ్ది తెలుగు పత్రికా ప్రముఖులందరితోనూ కలిసి రామచంద్ర పని చేశారు. ఇంచుమించు అన్ని పత్రికలలోనూ రాశారు. ముఖ్యంగా దినపత్రికలలో రాశారు. పత్రికారచననే వృత్తిగా చేసుకోవడానికి ఆయనను ప్రోత్సాహపరిచిన అంశంపేమంటే ఆ కాలంలో అంటే తాను వృత్తిని ఎంచుకున్న కాలం నాటికి పత్రికా వృత్తి దేశసేవలో ఒక భాగం అని రామచంద్ర చెప్పుకున్నారు. స్వాతంత్ర్యోద్యమ నాయకులుగా, స్ఫూర్తిదాతలుగా గణనకెక్కిన ప్రముఖులందరూ కిందటి శతాబ్ద ఉత్తరార్ధం వరకు పత్రికా నిర్వహణ సంబంధం ఉన్నవారే. పత్రికా సంపాదకులుగా, రచయితలుగా ప్రసిద్ధి పొందిన వారే. మహాత్మాగాంధీ మొదలుకొని, మోతీలాల్, జవహర్‌లాల్, బాలగంగాధర తిలక్, లజపతిరాయ్, అరవిందుడు, మాలవ్యా, రాజేంద్ర ప్రసాద్ మొదలైన వారందరూ పత్రికలు నిర్వహించిన వారే. ఇక ఆంధ్రదేశానికి సంబంధించి కూడా ఆంధ్ర కేసరి ప్రకాశం, పట్టాభి, కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని

నాగేశ్వరరావు గారలు పత్రికలు నడిపిన వారే. జనప్రియత గల మంచి పత్రికలో పనిచేసే వారికి దేశ నాయకులందరితో సులభంగా పరిచయమూ, సమాజంలో మెప్పుదలా, గుర్తింపూ, గౌరవమూ, ప్రేమాదరాలు లభించేవి. అందువల్ల పత్రికలలో పని చేసే వృత్తి ఆ రోజులలో రామచంద్ర అన్నట్లు దేశసేవలో భాగమే. అంతే కాక పత్రికా రంగంలో రాణించాలంటే ప్రపంచ వ్యవహారాలు, పరిణామాలు నిరంతరం తెలుసుకుంటూ ఉండాలి. వేగవంతంగా సమాచార సేకరణం, అంతకన్న త్వరితంగా విషయసంగ్రహణం, దానిని రాయగలిగి ఉండడం అలవరచుకోవాలి. అందువల్లనే నార్ల వెంకటేశ్వరరావు, సమర్థుడైన పత్రికారచయిత అవ్యవధానంగా ఏ విషయమైనా గంటకు 'కాలమ్' రాయగలగాలి అనే వారుట. రామచంద్ర ఆ ప్రమాణానికి నిలబడగలిగిన వారే. టెన్సింగ్ నార్కే హిమాలయ అత్యున్నత శిఖరారోహణం చేసినప్పుడు ఆ వృత్తాంతం ఎంతో విపులంగా, విజ్ఞానదాయకంగా ఆ ఘనకార్యం సాధించిన ఆ ప్రముఖ వ్యక్తినే ఇంటర్వ్యూ చేసి ప్రచురించారు రామచంద్ర. శ్రామికజీవన సౌందర్యం అనే దేవీప్రసాదరాయచౌదరి శిల్పం కళాత్మకంగా ఆ రోజుల్లో ఎంతో పేరు తెచ్చుకోగా సవ్యయంగా ఆ మహాశిల్పితో ఇంటర్వ్యూ చేసి తమ శిల్ప కళా వేతృత్వాన్ని నిరూపించుకున్నారు. షేక్ చినమౌలానా సాహెబ్, దాలిపర్తి పిచ్చిహరి వంటి గొప్ప సంగీత కళాకారులతో ఇంటర్వ్యూలు జరిపి శాస్త్రీయమైన లోతుపాతులన్నిటిని వివరించగలిగారు. గోటువాద్యం, గోటి నొక్కుల చిత్రాలు, యోగాసనాలు, నీటివర్ణచిత్రాలు, బహువేషధారణ సద్యఃకాల కళాత్మక ప్రతిభ మొదలైన విషయాలను ఆ ప్రత్యేక కళాప్రతిభను చిరకాలం పరిశ్రమ చేసి తెలుసుకొన్న వారిలాగా రామచంద్ర రాయగలిగేవారు. సంగీతం, నాట్యశాస్త్రాల, పాండిత్యంలో కూడా ఆయన రచనలలో అసాధారణ ప్రజ్ఞ కనపడుతుంది.

జర్నలిజం వృత్తిలో ప్రవేశించడంలో ఆయన మొదట ఇంగ్లీషు పత్రికతో ప్రారంభించారు. కాన్పూర్ నుంచి వెలువడే 'డెయిలీ టెలిగ్రాఫ్' ఆ పత్రిక. దీని సంపాదకులు వెంకట్రామన్ అనే దాక్షిణాత్యుడు. రెండో ప్రపంచం యుద్ధ కాలంలో అది కొత్తగా మొదలైంది. రామచంద్రకు జర్నలిజం పట్ల ఆసక్తిని, అంకితభావాన్ని కలిగించినవారు వెంకట్రామన్‌గారే. జర్నలిజంకు సంబంధించని వృత్తి కాని, మానవ వ్యాపారప్రవృత్తి కాని పృథ్విలో ఏదీ ఉండదు అన్న పరమసత్యాన్ని బోధించిన వారు కూడా వెంకట్రమన్‌గారే. 'డెయిలీ టెలిగ్రాఫ్' ఆఫీసులోనే రామచంద్రకు బస కూడా ఇచ్చారు. ఈయనా దాక్షిణాత్యుడే కనుక వంటశాల అజమాయిషీ కూడా మీదేనని చనువుగా రామచంద్రను ప్రోత్సహించారు. తీరిక వేళల్లో ప్రూఫ్ రీడింగ్ నేర్చుకోండి అని సలహా ఇచ్చారు. ఈ పత్రికలో రామచంద్ర పని చేయడం మొదలు పెట్టిన వారం రోజుల్లోనే కాన్పూర్‌లో రాహుల్ సాంకృత్యాయన్ ప్రసంగించే సభ

ఒకటి తటస్థించింది. ఈ సభకు వెళ్లి మీ శక్తి మేరకు సారాంశం రాసుకొని రండి అని వెంకట్రామన్ రామచంద్రను కోరారు. రామచంద్రను ప్రోత్సహించడానికా అన్నట్లు ఆ రిపోర్టును సంపాదకుడు చాలా మెచ్చుకున్నారు. కేవలం తాళపత్ర గ్రంథాలయాలలో పూర్వకాల గ్రంథాల వివరణ సూచి తయారు చేయడమే తన అనుభవమని వెంకట్రామన్ గారితో చెప్పుకోవటానికి రామచంద్ర సంకోచించినా అదీ యోగ్యతేనంటూ, కాఫీ హోటల్‌లో ఎంగిలి కప్పులు కడగటం దగ్గర నుంచి అన్ని వృత్తులు తెలిసి ఉండటం పత్రికా వృత్తికి సమ్మతమే అన్నారాయన. ఆ అనుభవం నాకుంది అన్నారు రామచంద్ర. నిజానికి చెన్నపట్నం మింట్ వీధిలోని గుజరాతీ హోటల్‌లో, తిరువళ్లికేణిలోని రామవిలాస్ హోటల్‌లో రామచంద్ర పిండి రుబ్బటం వంటి పనులెందుకు చేశారో తెలియదు. భుక్తి గడవక అని అనుకోలేము. ఆయన చిత్త వృత్తిలో ఏదో విచిత్ర ప్రవృత్తి ఉన్నది. శారీరక శ్రమలోని సార్థక్యమేమిటో తెలుసుకోవాలన్న ఉత్సుకతతోనే ఆయన అటువంటి పనులు చేసి ఉండవచ్చు. నిరుద్యోగం ఆయననెప్పుడూ భయపెట్టలేదు. రాకాసి నూలుమిల్లులో గుట్టలు గుట్టలుగా పడి ఉన్న నూలుకండెలు, దూదిబేళ్ళా లెక్కలు రాసేపని ఆయన కొన్నాళ్లు చేశారు. తరువాత లాహోర్‌లో పరిచయస్థుడైన రఘునాథసింగ్ కాన్పూర్‌లో గంగాతీరంలో తనకు తటస్థపడి మనం నేపాల్ వెళ్ల కలప వ్యాపారం చేదాము, రెండు-మూడు రోజుల్లో తిరిగి వస్తాను అని చెప్పి పోగా అతడి కోసం గంగాతీరంలో నెల రోజులు పస్తులుండి కేవలం రెండు పూటలా గంగాజలమే శరీరధారణకు ఆధారంగా నిరీక్షించారు రామచంద్ర. ఆయన స్థితికి జాలి పడి ఒక అపరిచితుడు ఇంటికి తీసుకొని వెళ్లి భోజనం పెట్టాడు. బట్టల మిల్లులో రామచంద్రకు పని కుదిర్చింది కూడా హరిలాల్ అనే ఈ అపరిచిత మిత్రుడే. బట్టల మిల్లులో పని చేయలేక కాన్పూర్‌లోనే ఒక పుస్తకాల షాపులో పాఠ్యపుస్తకాల సంచార విక్రేతగా కొన్నాళ్లు పని చేశారు. అక్కడ యజమాని తనను నిరాదరణ చేయడం నచ్చక మళ్లీ గంగాతీరంలో ధర్మసత్రంలో తలదాచుకున్నారు. చేతిలో ఒక రూపాయి ఉండగా క్షత్రియుల హోటల్‌లో రోజూ ఒక అణా పెట్టి రొట్టె తింటూ కాలక్షేపం చేశారు. ఆ తర్వాత డెయిలీ టెలిగ్రాఫ్ ఉద్యోగంలో చేరారు. చివరకెలాగో తానీ వృత్తిలో స్థిరపడదలచానని తండ్రి గారికి ఉత్తరం రాయగా ఆయన పుత్ర స్నేహం వల్ల ఆంధ్ర దేశానికి వచ్చి తెలుగు పత్రికలలో దేనిలోనైనా ఉద్యోగం చూసుకోవలసిందిగా అర్థించారు. ఆయన అనంతపురం వచ్చి అక్కడి నుంచి అత్తవారి ఊరు సురపురం వెళ్లి అక్కడి నుండి హైదరాబాద్ చేరి అప్పట్లో ఆడవి బాపిరాజు గారి సంపాదకత్వంలో వెలువడుతున్న మీజాన్ తెలుగు దినపత్రికలో చేరడం, అప్పటి నుంచి అర్ధశతాబ్ది పత్రికా రంగానికే అంకితం కావడం జరిగాయి.

ఆంధ్రపత్రిక సంస్థలో పని చేస్తున్నప్పుడు రామచంద్ర కొంతకాలం భారతి సాహితీ మాస పత్రిక సంపాదకత్వం నిర్వహించారు. ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలకు సంపాదకత్వం వహించారు. దినపత్రికలలో పని చేస్తున్నప్పుడు అప్పుడప్పుడు సంపాదకీయాలు కూడా రాశారు.

సర్వేపల్లి రాధాకృష్ణ భారత దేశ ఉపాధ్యక్షులుగా ఉన్నకాలంలో ఒకసారి భద్రాచలం దివ్యక్షేత్ర సందర్శన కోసం వచ్చారు. అప్పుడు రామచంద్ర సర్వేపల్లివారి భద్రాచల సందర్శనాన్ని వివరంగా ఆంధ్రపత్రికలో రిపోర్టు చేశారు. స్వతంత్ర భారత దేశంలోని చారిత్రక సంఘటనలు రామచంద్ర పత్రికలలో విపుల వివరణలు, వ్యాఖ్యానాలతో ప్రకటించారు. ఇక సాహిత్యసంబంధమైన ప్రత్యేక సంచికలన్నీ వారు ఎంతో శ్రద్ధగా రూపొందించేవారు.

కలకత్తా నుంచి వెలువడే ఉదంత మార్తాండ అనే పత్రిక దేశీయ భాషలలో వెలువడే దినపత్రికలన్నిటా మొదటిది. నూట ఏభై సంవత్సరాలుగా వస్తున్నది. ఈ పత్రిక నూట యాభైయవ జయంతికి భారతీయ పత్రికా రచయితలలో వయోధిక ప్రాజ్ఞులైన వారూ, చిరకాలం పని చేసినవారూ అయిన వారిని సన్మానించింది. తెలుగు పత్రికా రంగం నుంచి ఇటువంటి సన్మానం అందుకున్న వారు తిరుమల రామచంద్ర. తమ వృత్తి సార్థకతను గూర్చి ఆయన ఇట్లా చెప్పారు. పత్రికా రచయితలు తేనెటీగల వంటి వారని రామచంద్ర భావం. 'వెరపెరుగని వృత్తిలో వారు తాము సేకరించిన మధువుతో పెరవారికి విందు చేస్తారు' అని కూడా చెప్పుకున్నారు రామచంద్ర. పత్రికా రచయితగా రామచంద్రకు ఒరవడి దిద్దింది అడవి బాపిరాజు. 'విషయానుగుణమైన శైలిని ఆయన దగ్గర పని చేయడం వల్ల నేర్చుకున్నాను. బాపిరాజుగారు ఆత్మగుణ సంపన్నుడు. ఉదాత్త మానవుడు. పూర్తిగా గాంధీజీ అనుయాయి' అని రామచంద్ర నివాళి ఘటించారు.

కుటుంబ లోనూ, సమాజంలోనూ గౌరవం పొందడానికి మానవుడు న్యాయంగా, నీతిగా వ్యవహరించాలి అనే ఒక సంస్కృత శ్లోకాన్ని రామచంద్ర స్వీయచరిత్రలో ఉదాహరించారు. దీనికి ఉదాహరణ ప్రాయంగా తన జీవితాన్ని గడుపుకున్నారాయన. 'సత్యం, తపస్సు, జ్ఞానం, అహింసాగుణం, విద్వాంసులను సేవించడం, ఉత్తమ శీలం' – ఈ గుణాలున్న వాడే విద్వాంసుడు అని ప్రశంసిస్తూ చెప్పారు రామచంద్ర. ఈ సుగుణాలు రామచంద్ర జీవిత వర్తనంలో పాటించారు.

'వివేకవంతుడు పరుల కోసం ధనం, జీవితం వినియోగించాలి. వినాశం తప్పదు కనుక పరుల కోసం త్యాగం చేయడం ఉత్తమం' అని ఒక ప్రస్తావనలో అన్నారు. తమ దగ్గర బంధువులలోనే ఒకరు సుగుణవతి, వివేకవతి, విద్యావతి,

కలవారింటి పడుచు అయిన యువతి తనను వివాహం చేసుకోవలసిందిగా అర్థించినా, స్థిరమైన జీవిక కాని, విద్యాయోగ్యత కాని, సంపన్నత కాని లేని తాను ఆమెను వివాహం చేసుకోవడానికి అర్హుడను కాను అని గొప్ప ఔదార్యం ఆయన చూపగలిగారు. అతిబాల్యంలోనూ, తెలిసీ తెలియని వయసులోనూ, చేసిన తప్పులు చెప్పుకుని ఆయన పశ్చాత్తాపం వెలిబుచ్చారు. తల్లిదండ్రులను ఎప్పుడూ విధేయతతో అనువర్తించారు. తన గొప్పలు ఎప్పుడూ చెప్పుకోలేదు. తన లోపాలు విస్మరించలేదు.

తన వృత్తిలోనే కాదు, సత్ప్రవర్తనలోనూ రామచంద్ర తెలుగు వారి ఆదికవి నన్నయ్య గారన్నట్టు సత్ప్రతిభాభియోగ్యుడే !

---

# 14. విపులాచ వృథ్వీ

'యః పఠతి లిఖతి సుకృతిం
పరిపృచ్ఛతి పండితా నుపాసయతి
తస్య దివాకర కిరణై
ర్నలినీవ విబోధ్యతే బుద్ధిః'

లోకహిత సహితమైన మంచి రచన చేసినా రాసినా చదివినా, మహాత్ములైన పండితులను చేరి ప్రశ్నించి వారినుపాసించి జ్ఞానలాభం పొందినా, అటువంటి వారి బుద్ధి సూర్యకిరణాలు సోకిన కమలం వలె వికసిస్తుంది – అని యీ శ్లోకం తాత్పర్యం. లోకంలో ఉన్నా, లోకాతీతంగా వారి వ్యక్తిత్వం శోభిస్తుందని అర్థం.

ఈ శ్లోకం రెండు వేల ఏళ్ల కిందటి దంటారు పండితులు. దీనిని రచించిన మహారాజు సుందరపాండ్యుడు. ఈయన మహాపండితుడు కూడాను. తమిళ సంఘవాఙ్మయంలోనూ ఈయన గూర్చిన ప్రస్తావనాధారం ఉంది కాబట్టి పూర్వకాలంలో ఎప్పుడో మధురనేలిన మహారాజు అని విద్వద్విమర్శకుల అభిప్రాయం.

తిరుమల రామచంద్ర విషయంలో ఈ మంచి మాట వర్తిస్తుంది. ఆయన ఒక గ్రంథానికి ఉపోద్ఘాతం రాస్తూ 'సమ్యక్ సంభాషితం – సమ్యాక్ వక్కణం' అని గ్రంథకర్తనూ గ్రంథ విషయాన్నీ శ్లాఘించారు. రామచంద్రగారి సర్వరచనలూ అటువంటివే. ఆయనే స్వీయచరిత్ర ముగింపు మాటలుగా ఇట్లా చెప్పారు. 'ఎవడు దేశాలు తిరుగుతాడో, ఎవడు పండితులకు సేవ చేస్తాడో, వారి బుద్ధి నీటిలో పడిన నూనె చుక్కలా విస్తరిస్తుంది. నాలో ఇది ఎంత వరకు నిజమో అని ఆలోచించుకుంటూ నడుస్తున్నాను. నూరేళ్లూ ఇలా నడక తప్పదేమోననిపించింది' అని వారు తన జీవన గాథను ముగించారు. ఆయన తనను 'సాహితీసుగతుడుగా' అభివర్ణించుకున్నారు. గమ్ అనే ధాత్వర్థం జ్ఞానమని కూడా సంస్కృత పండితులు చెబుతారు. సాహిత్యంలో సమాజ సంబంధాలలో ఆయన ప్రవర్తన ఎప్పుడూ సౌగతమే.

రామచంద్ర జీవితకాలంలో సాహిత్య పరులలో సమకాలికులలో, ఎవరూ చూడనంత దేశం చూశారు. పండితులతో పరిచయాలు చేసుకున్నారు. వారి విద్వత్తను, జ్ఞానకాంతిని ఆకళించుకున్నారు. 'మహబూబ్‌నగర్ మండలం సాహిత్య మణిదీపాలు'

అనే శీర్షికతో రామచంద్ర ఒక వ్యాసం రాశారు. అందులో వారిట్లా అన్నారు. 'ఈ పాలమూరు (మహబూబ్‌నగర్) జిల్లాను తలచుకొన్నప్పుడల్లా నేను పొంగిపోతుంటాను. నాకు వైయక్తికమైన సంబంధముంది. నా మిత్రుల తాతలు తండ్రులు విద్వత్కవులయిన వారు నాకు దీనితో ఆత్మీయత కలిగించారు. ఈ జిల్లాలోని సంస్థానాలు (గద్వాల, వనపర్తి మొదలైనవి) సంస్థానాల పండిత వంశాలు ఈ ప్రాంతానికే కాక యావదాంధ్ర దేశానికి, భారత దేశానికి కూడా తెచ్చిన కీర్తి సామాన్యమైనది కాదు అన్నారు రామచంద్ర. కాశీవిద్వాంసులలో మహాప్రతిభా పూర్ణులని కీర్తి పొందిన శివకుమార్ పండిత్‌జీనే వాదంలో నిలువరించగల నరసింగయ్య శాస్త్రి గారిని స్వయంగా దర్శించారు రామచంద్ర. వారి (శాస్త్రిగారి) చమత్కార సంభాషణలు, కథలు ఈ వ్యాసంలో తెలియజేశారు రామచంద్ర.

తాము పంజాబ్ యూనివర్సిటీ ప్రాచ్యలిఖిత భాండాగారంలో (లాహోర్) అపురూప తాళపత్ర గ్రంథాల సూచీకరణ నిర్వహిస్తున్న రోజులలో అక్కడి ఓరియంటల్ కాలేజీ ప్రిన్సిపాల్ మాధవశాస్త్రి భండారీ మహాశయుణ్ని గూర్చి ఇట్లా వ్రాశారు రామచంద్ర. 'భండారీజీ గర్భాష్టమంలో (8 ఏళ్లు నిండకుండా) ఉపవీతులై పన్నెండేళ్లు వ్యాకరణ శాస్త్రం, తర్వాత పది సంవత్సరాలు న్యాయ మీమాంస శాస్త్రాలు అధ్యయనం చేసిన మహా విద్వాంసుడు. విద్యకు తగిన శీలం, బంగారు మైచాయతో పొడుగ్గా పలచగా మరాఠీ టోపీతో గోఖలేలాగా ఉండేవారు.' ఈ మహోపాధ్యాయుడికి తమ జాతకం చూపి తమ భవిష్యత్తును గూర్చి సంప్రదించారు రామచంద్ర. కళాశాలలో ఉరుదూ, ఫారసీ, అరబిక్ శాఖల అధ్యక్షులూ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ విద్వాంసులూ అయిన డా. ఖురేషీగారికి, మాధవశాస్త్రి భండారీ మహోదయుల పట్ల ఎటువంటి గౌరవాదరాలుండేవో రామచంద్ర స్వీయచరిత్రలో వర్ణించారు. కాశీ సంస్కృత పీఠం మహామహోపాధ్యాయులు మీమాంసాశాస్త్రాచార్యులు చిన్నస్వామిశాస్త్రి గారి ఉపన్యాసం విన్నారు. రాహుల్ సాంకృత్యాయన్‌తో సంభాషించారు. డా. రఘువీర గూర్చి స్వీయచరిత్రలో ఒక అధ్యాయమే రచించారు రామచంద్ర. ఆర్యసమాజీయులైన గొప్ప కవిపండితులతో ఎందరితోనో పరిచయాలుండేవి రామచంద్రకు. ఋగ్వేద పదానుక్రమణిక (కంకార్డెన్స్) సంధానించిన ఆచార్య భగవద్దత్‌తో రామచంద్ర వైదిక సంస్కృతిని చర్చించారు. మద్రాస్ విశ్వవిద్యాలయానికి సంబంధించిన సంస్కృతా చార్యులు కున్హన్‌రాజ్, డా. వి. రాఘవన్ మొదలైన విద్వాంసులతో, నేలటూరి వేంకటరమణయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి వంటి చరిత్ర పరిశోధకులతో జ్ఞాన వినిమయ సాంగత్యం ఉండేది రామచంద్రకు. రామచంద్ర మూడు చోట్ల వేదసంస్కృత పురాభారతీయ విజ్ఞాన బోధన కళాశాలల్లో చదివారు. అందువల్ల తిరుపతిలో, నెల్లూరిలో, మద్రాసులో ఎందరో గొప్ప విద్వాంసుల

పాఠ్యప్రవచన పరిచయం వారికి సమకూడింది.

విస్తారంగా దేశం పర్యటించటం వల్ల భారతీయ సాంస్కృతిక వారసత్వ వైవిధ్యం, లలిత కళలు, విద్యలు, శాస్త్రాలు ఏ విధంగా దేశంలో వ్యవహారంలో ఉన్నాయో ఆయన తెలుసుకోగలిగారు. 'పద్యాలకు రాగాల నిర్దేశం' అనే వ్యాసంలో రామచంద్రే ఇట్లా చెప్పుకున్నారు. 'గ్రామైక రాత్రంగా దేశమంతా తిరిగాను. చాలా వరకు ప్రతిరాష్ట్రంలోను వేసే నాటకాలు సంస్కృత నాటకాలు, నృత్యకలాపాలు చూశాను. బెంగాలీల 'ఒనాథ్రు తొంపుస్పాం కి సోలాయెు' విని చెవులు మూసుకున్నాను. ఉత్తరప్రదేశ్ వారు చప్పయ్, చేపా ఈ బాణీలలో చదివే సంస్కృత నాటక శ్లోకాలు విని తులసీదాసుకు, ఆయన ఆరాధ్య దైవమైన జానకీజానికీ నమస్కారం పెట్టాను. శ్లోకం కంటే రాగానికే ప్రాధాన్యమిచ్చే తమిళుల తీరుకు తల ఊపడం మానుకున్నాను. ఫారసీ గజల్‌లాగా, శేర్‌వాణి చదివే పంజాబీల పద్ధతి విని పరుగు తీశాను' అని ఆయన పరిహాస బాణీలో రాశారు. పంజాబీల హీర్‌ఛందస్సు తెలుగు వారి మధ్యాక్కర వంటిదే అని చెప్పారు రామచంద్ర. ఖారవేలుడి పేరు ఉత్పత్తి విషయమై సునీత్‌కుమార్ ఛటర్జీని సమర్థించారు. రామచంద్ర రచనలలో శ్రుతి స్మృతులు భారత భాగవత రామాయణాలు, కావ్య వ్యాఖ్యానాలు, శాస్త్ర భాష్యాలు ఉదాహరించారు. విశాలమైన దేశం పర్యటించినందువల్ల భారతదేశ జనజీవన సరళి ఆయన తెలుసుకున్నారు. లాహోర్‌లో ఉన్నప్పుడు పంజాబీల పితృమేధకర్మల వైనం పరిశీలించారు. సైన్యంలో పని చేస్తున్నప్పుడు పర్షియా దేశపు (ఇరాన్) సరిహద్దు వరకు పర్యటించి అక్కడి గత చరిత్రను, సంస్కృతిని గూర్చి తెలుసుకున్నారు. బెలూచిస్థాన్‌కు వాయవ్యంగా నిజాహిదీన్, శిబి, షీలాబాగ్ నగరాలున్నాయనీ, వాటిని దర్శించాననీ చెప్పారు. పురాణ ప్రసిద్ధుడైన శిబి చక్రవర్తి పరిపాలిత దేశం కాబట్టి అక్కడి శిబి పట్టణం ఏర్పడిందనీ, శైలప్రాంతీయ పార్సీయువతులు పరమ సుందరులనీ, వాళ్ల మేని కాంతిలో అద్దంలోలా ప్రతిబింబాలు చూసుకోగలిగినంత శరీర నైగనిగ్యం కల వారనీ, అయినా దుస్సహ అతిపరితాపకర శీతల వాతావరణంలో తగినంత రక్షక వస్త్రాచ్ఛాదన కూడా నోచుకోలేని బీదతనంతో విలవిలలాడుతారనీ రామచంద్ర రాశారు. సైన్యంలోనే తనకు ఆప్తమిత్రులూ, ఏకోదరులూ అయిన ఫతేసింగ్, కర్నైయిల్ సింగ్‌లు తమకు తల్లి ఒక్కతే అయినా తండ్రులు ఒక్కరు కారని స్ఫురింపచేయడంలో సామాజిక కులాచారమేమిటా అని మథనపడ్డారు. ఈ సమస్యను స్వయంగానే పరిష్కరించుకోగలననుకుంటూ ఆ సిక్కుసోదరుల స్వగ్రామమైన పాన్సటా చేరి ఆ సోదరుల కన్నతల్లి వాత్సల్యాదరాభిమానాలను సంపాదించుకున్నారు రామచంద్ర. పాన్సటా గ్రామం జలంధర్‌కు ఐదు మైళ్ల దూరంలో ఉంది. జలంధర్ రైలు స్టేషన్‌లో దిగి ఐదు మైళ్లు

జొన్నచేలలో నడచి కర్నెయిల్‌సింగ్ మాతృమూర్తిని దర్శించి ఆమె ద్వారానే ఆ సోదరుల జననవృత్తాంతం తెలుసుకున్నారు. పంజాబీలలో కొన్ని కులాలలో సోదరుడు మరణించగా మరో సోదరుడు అన్న భార్యను పెళ్లాడే ఆచారం ఇంకా ఉన్నట్లు తెలుసుకొని ప్రేంచంద్ కథలలోని అటువంటి ఉదంతాలను అర్థం చేసుకోగలిగానని రాశారు రామచంద్ర. లాహోర్‌లో తనకు పరిచయమైన గోపాల్ అనే సంస్కృత విద్యార్థి ముల్తాన్ వెళ్లి అక్కడ చదువుకుంటున్నాడని తెలిసి ముల్తాన్ వెళ్లి అతడిని వెదకి పట్టుకున్నారు. పంజాబ్ అంతా తిరిగి అక్కడి గ్రామీణ జీవనాన్ని గూర్చి తెలుసుకున్నారు. ఆయర్వేద విజ్ఞానంలో మహోపాధ్యాయులైన పండిత దివి గోపాలాచార్యుల వారు లాహోర్ ఆయుర్వేద కళాశాల భవనానికు శంకుస్థాపన చేసిన వృత్తాంతం తెలిపే పాలరాతి ఫలకం చూసి అత్యంతానంద సంభరితులైనారు. లాహోర్‌లో ఉంటున్నప్పుడే రామచంద్ర గదికి కొందరు గోసాయిలు వచ్చారు. మద్రాసులో విజ్ఞానచంద్రికా మండలిలోనూ, ఆ తర్వాత ఆంధ్రపత్రికలోనూ పని చేసిన వేలాల సుబ్బారావు తమ జట్టు వాడనీ ఆయనను దేశసేవ నిమిత్తమే తాము మళ్లీ లౌకిక జీవనంలోకి మళ్లించామని, ఆయన క్షేమ సమాచారాలు మీకు తెలుసునేమో కనుక్కోవటానికి మేము వచ్చామనీ ఆ గోసాయిలు చెప్పినట్లు రామచంద్ర రాశారు. అట్లానే లాహోర్ రైల్వే స్టేషన్ దగ్గర ధర్మశాలలో కొందరు తెలుగు సాధువులు మకాము చేసి ఉన్నట్లు తెలిసి ఒక సిక్కుమిత్రుడి ప్రేరణతో వెళ్లి చూశామని రామచంద్ర రాశారు. ఒకరోజు లాహోర్ రథ్యలలో నడుస్తుండగా ఒక వీధి ప్రదర్శనాలు చేస్తూ తాను జగదేక మల్లవిద్యా విశారదుడు కోడి రామమూర్తి మహాశయుల శిష్యుణ్ని అనీ, తన పేరు గుల్జార్‌సింగ్ అయినప్పటికీ సింగు (సింగం) అనే గౌరవం తమ గురువు గారికొక్కరికే సార్థకం కాబట్టి తాను తన పేరును గుల్జార్ మూర్తిగా మార్చుకుంటున్నానని చెప్పుకోవటం విని తనకు చాలా ఉత్తేజం కలిగినట్లు రామచంద్ర రాసుకున్నారు. కారణం కోడి రామమూర్తి తమ తండ్రిగారికి మిత్రులే కాక ఆంధ్రదేశానికీ, అఖిల భారత దేశానికి ఖ్యాతి నార్జించిన మహనీయుడు అని రామచంద్ర స్మరించుకున్నారు. ఏడెనిమిది సంవత్సరాల కాలం రామచంద్ర భారతదేశంలో వివిధ ప్రాంతాలు దర్శించటం వల్ల ఆయన దేశ భిమానం, దేశ సంస్కృతి సమగ్రత, విజ్ఞాన వికాసం ఆయన రచనలన్నిటా ప్రతిఫలిస్తాయి. ఈశ్వరచంద్ర విద్యాసాగరుల సాహితీ సంస్కృతి మూర్తిమత్వాన్ని గూర్చి ఒక రచనలో ప్రస్తావిస్తూ, విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ ఆ మహానుభావుడితో పోలిక తెచ్చుకుంటే తానొక కీచురాయినని అభివర్ణించుకున్నాడు. తిరుమల రామచంద్ర సాహితీమూర్తిమత్వాన్ని చిత్రించవలసివచ్చినప్పుడు 20వ శతాబ్ది అతిసామాన్య తెలుగు రచయితలు ఇక ఏమనుకోవాలి ? ఆయన మంచి రచయితే కాదు, గొప్ప రచయిత కూడాను.

# 15. మరపురాని మనీషి

రామచంద్రకు పూర్వ సాహిత్యం పట్ల, ప్రాచీన సంస్కృతి పట్ల ఎంతటి ఆస్థ ఉండేదో, సమకాలిక సాహిత్యం పట్ల, నవ్య రచనల పట్ల, అంతటి అభిమానం, గౌరవాదరాలు ఉండేవి. కాళిదాసు చెప్పిన సంతఃప్రవృత్తి ఆయనలో పుష్కలంగా ఉండేది. మహారాష్ట్ర సాహిత్యంలో మహానుభావ పంథా అని ఒకటి ఉంది. సంత్ సాహిత్యమనే విభాగం కూడా ఉంది. రామచంద్ర అలౌకిక ఆధ్యాత్మిక సాహిత్య ప్రవృత్తుడు కాకపోయినా సుమానుషమైన సాధు ప్రవృత్త చిత్తవృత్తుడు. కాబట్టి ఆయనను 'సంత్'లలోనూ, మహానుభావులలోనూ పరిగణించవచ్చు. సాహిత్యపరమైన ఉదాత్తశీలత ఆయన సర్వరచనలలోనూ సాక్షికమే. ఆవేశోద్వేగాలకూ, పాక్షిక రాజకీయ సామాజిక సిద్ధాంతాలకూ, ప్రయోగవాదకుశలతకూ ఆయన రచనలు ఎప్పుడూ దూరమే. సాహిత్యం ఆలోచనామృతం అనటానికి ఆయన రచనలు అనుకూలిస్తాయి. పాతకొత్తల మేలుకలయిక ఆయన సాహిత్య వ్యక్తిత్వం.

సాహిత్యం పాఠకుణ్ని రంజింపచేయటమే కాక మనస్సును ఉదాత్తీకరించి చిత్తవృత్తుల ప్రశమనం సాధించాలని రామచంద్ర ఆశయం. ప్రపంచ సాహిత్యంలో ప్రసిద్ధ రచయితలందరి కోరిక, అభిమతం, ప్రబోధం అదే కదా ! ఉత్తమ, మధ్యమ, అధమ ప్రమాణాలు, అభిరుచులూ సాహిత్య వ్యాసంగంలో కూడా పని చేయవచ్చు. కాని మానవత్వ పరిపూర్ణతను లక్ష్యించేదే తన ప్రయోజనాన్ని సిద్ధింప చేసుకుంటుంది అని రామచంద్ర గాఢప్రత్యయం.

వేదోపనిషత్తుల కాలంలో కులాభిమానాలు, కులకాంక్షలు, ఆంక్షలు లేవు. జ్ఞానం ఒక వర్గం వారి సొత్తు కాదు. ఒక వర్గం వారి గుత్తాధికారం కాదు. అది ఎవరి దగ్గర ఉన్నా ఇతరులకు ఉపాదేయమే. అటువంటి సంస్కృతి నవీన భారతదేశానికి ఆదర్శం కావాలని రామచంద్ర ఆకాంక్ష. నవీన కాలంలో ఆయన పురా భారతీయ విజ్ఞాన వారసత్వ ప్రతినిధి. తాతతండ్రులు సముపార్జించి ఇచ్చిన విజ్ఞానమనే సొత్తును పదిలపరుచుకోవాలనీ, కనీసం తెలుసుకొని వారి సృజనాత్మక ప్రతిభను మెచ్చుకోవాలనీ అనేదే రామచంద్ర ఆశయం.

అర్ధశతాబ్ది కాలం పత్రికా రంగంలో పని చేసినందువల్ల ప్రపంచాన్ని గూర్చి తెలుసుకోవడం, తనకు తెలిసింది ఇతరులకు చెప్పడం ఆయన వృత్తిధర్మమైంది.

వృత్తినైపుణ్యంగా నిలుపుకోవాల్సి వచ్చింది. ఆయన విశాలమైన దేశాటనమూ, జనజీవన వృత్తుల వారినెందరినో కలుసుకోవడమూ ఆయన జర్నలిజం జీవితానికి ఎంతగానో తోడ్పడింది. ఎప్పటికప్పుడు కొత్త విషయాలను చెప్పడానికి, రాయడానికి ఆయనకు ఆస్కారం కలిగింది. కనీసం కొత్తగానైనా చెప్పడానికి భావుకత తోడ్పడింది.

ఆంధ్రప్రభలో ఆయన పనిచేస్తుండగా 1962 ప్రాంతాలలో సమకాలీన మనీషతను తనదైన భావవిలక్షణ ధోరణిలో పాఠకులకు తెలియజేసే అవకాశం ఆయనకు లభించింది. ఒక అర్ధ శతాబ్దంగా ఆయా రంగాలలో తమదైన మౌలిక సృజనశక్తులను, కళాత్మక ప్రతిభను, సాహిత్య సాంస్కృతికి సంపన్నతను జాతి అంచనాలలోనూ మరి కొంత వీరి అంచనాలలోనూ తెలిపే శీర్షికను ఆ వారపత్రికలో నిర్వహించారు రామచంద్ర. ఈ శీర్షిక పేరు 'మరపు రాని మనీషి.' ఇటువంటి విశిష్టులైన గొప్ప వ్యక్తులను 30 మందిని గూర్చి తెలిపిన శీర్షిక ఇది. ఇంచుమించుగా ఈ విశిష్ట వ్యక్తులు 19వ శతాబ్ది చివరి దశకంలోనూ 20వ శతాబ్ది మొదిటి దశకంలోనూ జన్మించినవారు. ఒకరిద్దరు ఈ పరిగణనలో చేరకపోవచ్చు. కాని ఆయా విశేష వ్యక్తులందరూ తమ ప్రతిభను ఐదారు దశాబ్దాలుగా తెలుగు వారికి శ్రుతపరిచిన వారే. సన్నిహితపరచిన వారే. సంగీతం, సాహిత్యం, నాటకరంగం, దేశచరిత్ర, స్వాతంత్ర్యోద్యమ పోరాట నిబద్ధత, పత్రికారంగాలలో తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని స్థిరీకరించుకొన్న వారితో ఈ ఇంటర్వ్యూలు జరిపారు రామచంద్ర.

రామచంద్ర నిర్వహించిన ఈ ఇంటర్వ్యూలు, ఆయా రంగాలలో శిఖరాయమానులైన ఆ వ్యక్తుల ప్రజ్ఞాసమీక్షలు ఆ వ్యక్తులను కూడా బాగా ఆకర్షించాయి. పాఠకులంతా ఎంతో ఆసక్తికరంగా చదివారు. ఇంచుమించుగా నిఖిలాంధ్ర దేశంలోని ఆయా రంగాలలోని ప్రముఖులందరినీ ఎంచుకున్నారు రామచంద్ర. ఈ రచనలో అదో కొత్తరీతి. ఉదాహరణకు విశ్వనాథ సత్యనారాయణగారిని ఇంటర్వ్యూ చేస్తున్నప్పుడు ఆయన జనన సంవత్సరం, పుట్టిన ప్రదేశం, గురుశిక్షణ, రచనా ప్రేరణలు ఇత్యాది అంశాల వివరణకు పూనుకోకుండా, కాశీవిశ్వవిద్యాలయంలో ఆయనకు జరిగిన సమ్మానం, ఆయన ప్రసంగం, అప్పటి విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన ఆచార్య నరేంద్రదేవ్, తక్కిన కాశీపండితులు ఆయనను ముక్తకంఠంతో మహా పండితుడుగా, భారతీయ భాషలలో సంస్కృత ప్రభావంతో కొత్తగా సృష్టించిన ఒక కొత్త రీతి ప్రవర్తకుడుగా ఆయన అభినందనలందుకుంటున్న ఉదంతంతో విశ్వనాథవారి పరిచయం ప్రారంభించారు. ఆ తర్వాత విశ్వనాథ వారి బహుముఖ ప్రజ్ఞను వివిధ ప్రక్రియలలో ఆయన ప్రశస్త రచనలను పరిచయం చేశారు. మీ సర్వ రచనలలోనూ చాలాకాలం నిలుస్తుందని మీరనుకుంటున్న రచన ఏదని ? ఆయననే

ప్రశ్నించారు. విశ్వనాథ వారి రచనలను గూర్చి ఏది ఎందుకు ప్రశస్తమో, ప్రశస్తతరమో చర్చించారు. ఈ విధంగా ఒక మహారచయితతో సముఖంలో గోష్ఠి జరిపి ఆ రచయిత రచనలను సమీక్షించడమనేది తెలుగు సాహిత్య చరిత్రలోనే అపూర్వం. 'నా సమస్త సాహితీశక్తులు, సకల భావన ప్రతిభ ఉపయోగించి రామాయణం రచించాను, అది తెలుగు సాహిత్యంలో స్థిరంగా కలకాలం నిలుస్తుందని నా విశ్వాసం' అని విశ్వనాథ వారు అభిప్రాయపడగా, రామచంద్ర మీ రచనలన్నిటిలోనూ మధ్యాక్కరలు (ఒక దేశి ఛందస్సులో ఆయన చేసిన తెలుగు వారి ప్రసిద్ధ పుణ్యక్షేత్ర దేవత స్తుతి రచన) గొప్ప రచన' అని రామచంద్ర విశ్వనాథ వారితోనే తన అభిప్రాయం చెప్పారు. తెలుగులో వచ్చిన నవలలన్నిటిలోనూ విశ్వనాథ వారి వేయిపడగలు పెద్ద నవల, ఇరవయ్యో శతాబ్దంలో తెలుగులో వచ్చిన మంచి లేదా గొప్ప నవలలో నుడికారంలో పరిమాణంలోనే కాక రచన వస్తు శిల్పతాత్త్విక సంవేదనల పరంగా వేయి పడగలు అగ్రగణ్యమైన నవల. ఈ నవలను గూర్చి రామచంద్ర ఆసక్తికరమైన విషయాలను రచయిత ముఖతః రాబట్టారు.

ఈ విధంగా రామచంద్ర ఆయా ప్రముఖులతో ఇంటర్వ్యూలు చేసినప్పుడు వారి మనీషత, అంతస్సత్వం ఆవిష్కరించగలిగారు. ఆధునిక తెలుగు కవులలో నాయని సుబ్బారావు కవితా వస్తువు పరంగానూ, కవితా భాషపరంగానూ విశిష్టుడైన కవి. తన జీవితానుభవ సంవేదనలనే, భావుక అనుభూతులనే కవితీకరించిన వాడు సుబ్బారావు. ఆధునిక తెలుగు సాహిత్యంలో మరే కవికీ, మరే సాహిత్యవ్యక్తికీ లేని ప్రత్యేకత నాయని వారికుంది. విశ్వనాథ వారి వేయి పడగల నవలలో కథానాయకుడైన ధర్మారావుకు కిరీటి అనే భావుక కవిమిత్రుడు అత్యంత సన్నిహితుడు. నాయని వారే ఆ కిరీటి. ఆ విధంగా నాయని వారి కవితా భావుకత ఒక మహాకవి నవలలో పాత్రత సంతరించుకుంది.

నాయని వారి సాహితీమూర్తి మంతాన్ని రూపుకట్టిస్తూ రామచంద్ర వేయి పడగలలోని కిరీటి ప్రణయోద్విగ్న వృత్తాంత వక్కణంతో ప్రారంభిస్తారు. తరువాత నాయని వారి కవితా పరమార్థమేమిటో సూత్రీకరిస్తారు. నాయని వారి ప్రత్యేకత ఏమిటో వివరిస్తారు. ఈ విధంగా ఆయా విశిష్ట వ్యక్తులతో ఇంటర్వ్యూలు చేసిన రచనలు ఈ 'మరపు రాని మనీషి' శీర్షికతో రామచంద్ర వెలువరించడం ఆధునిక తెలుగుసాహిత్యంలో ఒక కొత్త ప్రక్రియగా భావించవచ్చు. మళ్లీ ఇటువంటి రచన తెలుగులో రాలేదనడం సత్య దూరం కాదు.

ఒక విధంగా 20వ శతాబ్ది తెలుగు సాహిత్యానికి సమగ్ర సాహిత్య వ్యక్తిత్వం కలవారిగా, ఆధునిక కవితా ఉదాత్తాశయ స్ఫూర్తిగా విశ్వనాథ, నాయని సుబ్బారావులను భావించడం వల్లనే వీరిని ఈ శీర్షికలో చేర్చారు. వీరు కాక మరొక

ముగ్గురు ప్రసిద్ధ కవులను దేవులపల్లి కృష్ణశాస్త్రి, గుర్రం జాషువ, తుమ్మల సీతారామమూర్తి గారలను కూడా ఇంటర్వ్యూ చేశారు. ఆధునిక తెలుగు సాహిత్యంలో ఈ ముగ్గురు కూడా మూడు విశిష్ట కవితా పథ ప్రవర్తకులు. కృష్ణశాస్త్రిపై ఆంగ్ల కవితా ప్రభావం, జాషువాపై దళిత జీవన వేదన, తుమ్మల వారి రచనలలో దేశీయత, జాతీయత, గాంధీ ఉద్యమ ప్రబోధం ప్రత్యేకమైన ముద్ర వేశాయి. ఇక కాశీకృష్ణా చార్యులు, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, దీపాల పిచ్చయ్యశాస్త్రి వంటి పండితుల ఇంటర్వ్యూలు చాలా ఆసక్తిగా చదివిస్తాయి. దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు గొప్ప సాహితీవేత్త. వీరిది నెల్లూరు. వీరికీ 20వ శతాబ్దవు అత్యంత ప్రసిద్ధ పండితుడు, వ్యాఖ్యాత అయిన వేదం వెంకట్రాయ శాస్త్రి గారికీ సాహిత్య వాదవివాదాలుండేవి. అటువంటి వివాద ఘట్టంతో దీపాల వారితో ఇంటర్వ్యూ ప్రారంభించారు రామచంద్ర.

భారతదేశ స్థాయినే ఆధునిక కాలాన చెప్పుకోవలసిన గొప్ప పండితుడు, బహుభాషావేత్త అయిన గుండేరావు హర్కారేతో రామచంద్ర చేసిన ఇంటర్వ్యూ ఎంతో కుతూహలకరంగా సాగింది. గుండేరావు మహాశయుడి మాతృభాష తెలుగు కాకపోయినా ఆయన అష్టభాషా విశారదుడు. ఫార్సీ, ఉరుదూ, అరబ్బీ భాషలలో కూడా ఆ భాషలో ఉద్దండులైన పండితులతో సమానులు. ఇక సంస్కృతం. ఇంగ్లీషు, మరాఠీ, కన్నడాలలో కూడా ఆయన ప్రజ్ఞావంతుడు. పాణినీయ వ్యాకరణానికి సులభ బోధినిని రూపొందించినవాడు. గుండేరావు హర్కారే గారికి రామచంద్ర పట్ల విశేషాభిమానం ఉండేది. వీరిద్దరు ఒకసారి ఢిల్లీలో జరిగిన అఖిల భారతీయ ఆయుర్వేద విద్వాంసుల మహాసభలో పాల్గొన్నారు. కిందటి శతాబ్దిలో తెలుగునాట రంగస్థలంపై ప్రకాశించిన అద్దంకి శ్రీరామమూర్తి, పులిపాక వెంకటేశ్వర్లు, బందా కనకలింగేశ్వర రావులతో కూడా రామచంద్ర ఇంటర్వ్యూలు జరిపారు. రామచంద్ర ఈ శీర్షికలో వారి ప్రజ్ఞాప్రతిభాపాటవాలను వివరించారు.

సమాజ వికాసంలో గణనీయమైన స్థానాన్ని సముపార్జించిన మహిళల జీవిత సార్థక్యాన్ని కూడా రామచంద్ర ఈ శీర్షికలో చేర్చారు. కనుపర్తి వరలక్ష్మమ్మ మహిళాభ్యుదయం కోసం విద్యా సంస్థలు నిర్వహించిన విదుషి ఇల్లిందల సరస్వతీదేవి ఆధునిక సాహిత్యంలో తనదైన స్థానాన్ని పదిలపరచుకొన్న కథా, నవలా, జీవిత చరిత్ర రచయిత్రి. వరలక్ష్మమ్మ గారు కోస్తాప్రాంతానికి చెందిన వారు కాగా, ఇల్లిందల సరస్వతీదేవి గారు తెలంగాణ ప్రాంతం వారు. కిందటి శతాబ్ది పత్రికా రచయితలలో, సంపాదకులలో అఖిల భారత స్థాయినే ఖ్యాతినార్జించిన కోల వెన్నురామకోటీశ్వరారావు గారిని కూడా రామచంద్ర ఈ శీర్షికలో ఇంటర్వ్యూ చేశారు. కాగా తిరుమల రామచంద్ర కూడా ఈ శీర్షిక వ్యక్తుల వరుస చేరడానికి అన్ని విధాలా అర్హుడు !

శ్రీ తిరుమల రామచంద్ర తన సమకాలీనులైన తెలుగు వారిలో సాహిత్య,

కళా, రాజకీయ, సామాజికోద్యమ స్ఫూర్తిమంతులైన పెద్దలను కొందరను గూర్చి కార్టూన్ చిత్రాల ధోరణిలో హాస్యస్ఫూర్తిదాయకంగా లేఖినీ చిత్రాలు కూర్చారు. ఈ రచనను 'తెలుగు వెలుగు' లన్నారాయన. అక్షరాలలో 'కార్టూన్'లు చిత్రించిన వారు తెలుగు రచయితలలో ఇద్దరు ముగ్గురు కన్న లేరు. వీరిలో రామచంద్ర గొప్ప ప్రతిభావంతుడని ఈ రచనలు నిరూపిస్తున్నాయి. ఈ రచన ఒక శీర్షికగా ఆంధ్రపత్రిక వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైంది.

ఏది ఏమైనా శ్రీతిరుమల రామచంద్ర 20వ శతాబ్ది తెలుగు సాహిత్యంలో ఒక విశిష్ట మూర్తిమంతుడు. వారి వలె వైవిధ్య రచనలు చేసినవారు ఏ ఒకరిద్దరో మాత్రమే సమకాలీన తెలుగు సాహిత్యంలో కనిపిస్తారు.

తిరుమల రామచంద్ర తమ ఎనభయి అయిదవ ఏట 1997 అక్టోబరు 12న హైదరాబాదులో పరమపదించారు. వారి స్వీయచరిత్ర వారు పరమపదించిన మూడు నెలలకు వచ్చింది. అది చూసుకుని ఉంటే వారెంతో సంతోషపడే వారు. ఇటీవల కాలంలో తెలుగులో వచ్చిన గొప్ప పుస్తకాలలో ఈ పుస్తకం ప్రథమగణ్యం. ఈ గ్రంథం ద్వారా రామచంద్ర చిరకాలం తెలుగు వారికి గుర్తుంటారు.

# రామచంద్ర జీవితంలో ముఖ్యఘట్టాలు

జననం : 1913 జూన్ 17వ తేది (ప్రమాదీచ నామ సం॥ జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి, మంగళవారం)

తల్లిదండ్రులు : జానకమ్మ, శేషాచార్యులు

ప్రాథమిక విద్య : రాఘవంపల్లి (అనంతరపురం జిల్లా) కమలాపురం (బళ్లారిజిల్లా)

సంస్కృత విద్యార్జన : తిరుపతి కళాశాలలో వ్యాకరణ, సాహిత్య శిరోమణి పరీక్షల నిమిత్తం ఏడేళ్లు చదివారు.

జాతీయోద్యమ ప్రవేశం : 8 సం॥ల వయసుననే బళ్లారిలో గాంధీజీని దర్శించారు. 10 ఏళ్ల వయసుననే కాకినాడ కాంగ్రెసుకు (1923) పినతండ్రిగారితో కలిసి వెళ్లారు. 1929-30 సం॥లలో చిత్తూరు జిల్లా అంతా కాంగ్రెస్ ఉద్యమ ప్రచారం చేశారు. 14 సం॥ల వయసుననే తిరుపతి పట్టణ కాంగ్రెస్ కార్యదర్శి అయినారు.

కారాగారశిక్ష : 1932 సం.లో తిరుచిరాపల్లిలో ఒక సం. కఠిన కారాగార శిక్షననుభవించారు. 1933లో జైలు నుంచి విడుదలైన తర్వాత నెల్లూరు వేద, సంస్కృత కళాశాలలో చదివారు.

మద్రాసు కుట్రకేసు : 1934-36లలో మద్రాసు కుట్ర కేసులో విచారణకు గురిఅయినారు.

ఉద్యోగం : మొదట్లో మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో కాపీయిస్టు ఉద్యోగం. తర్వాత సైన్యంలో హవల్దారు క్లర్కుగా పని చేశారు. కొన్నాళ్లు లాహోర్ మాన్యుస్క్రిప్ట లైబ్రరీలో కాటలాగర్‌గా పని చేశారు.

పత్రికారంగం : 1944లో కాన్పూర్ 'డెయిలీ టెలిగ్రాఫ్' పత్రికలో 3 నెలలు, హైదరాబాదు నుంచి వెలువడిన 'మీజాన్' పత్రికలో 1944-47, ఆంధ్రప్రభ 1947-59, ఆంధ్రపత్రిక 1960-71, ఆంధ్రభూమి 1975-1979 పని చేశారు.

వివాహం : 1939 మే 7, సురపురం (రాయచూరు జిల్లా, గుల్బర్గా, కర్ణాటక,)

భార్య పేరు : శ్రీమతి అనంతలక్ష్మి (పుట్టింటివారి ఇంటిపేరు పెరుమాళ్ల వారు. కందాడైవారని కూడా అంటారు)

సంతానం : డా. నీరజ, డా. శేషశాయి, డా. ఆముక్త మాల్యద.

పరమపదం : అక్టోబరు 12, 1997.

రచనలు : మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు, గాథాసప్తశతిలో తెలుగు పదాలు, హిందువుల పండుగలు - పర్వములు, నుడి - నానుడి, తెలుగు పత్రికల సాహిత్యసేవ, క్షేమేంద్రుని అవదాన కల్పలత, బృహత్కథామంజరి, పురాతన బౌద్ధ ఇతిహాసం లలిత విస్తరం (అనువాదాలు) నాగలాపురం - దాని పరిసరాలు, ప్రాకృత వాఙ్మయంలో రామకథ, మూడు వాఙ్మయ శిఖరాలు, బృహదారణ్యకం, మనవి మాటలు, అహంభో అభివాదయే - ఈ చివరి మూడున్నూ వ్యాససంపుటాలు. హంపీ నుంచి హరప్పా దాక (స్వీయ చరిత్ర).

సన్మానాలు, బిరుదులు : మహామహోపాధ్యాయ (కాశీ పండిత పరిషత్తు) ప్రపంచ తెలుగు మహాసభలు (హైదరాబాద్ - కౌలాలంపూర్) పత్రకార్ శిరోమణి (ఉదంత మార్తాండ - కలకత్తా) మొ॥నవి.

# ప్రస్తావనకు వచ్చిన ప్రముఖవ్యక్తులు, గ్రంథాలు, సంస్థలు, స్థలాలు

అప్పారావు గురజాడ
అభినవగుప్తుడు
ఆంధ్రకేసరి ప్రకాశం
ఆంధ్ర పత్రిక
ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక
ఆంధ్రసాహిత్య పరిషత్తు
ఉమాకాంతం, అక్కిరాజు (1989-1942)
కమలాపురం
కర్ణాటక భాషాభూషణం
కాంచీపురం
కాటయవేముడు
కుందమాల
కుంభకోణం
కృష్ణమాచార్యులు, ధర్మవరం
కృష్ణాపత్రిక
కోదండ రామయ్య, తిమ్మావజ్ఝల
క్వెట్టా
నాగేశ్వరరావు, కాశీనాథుని
నారాయణదాసు, ఆదిభట్ల
పట్టాభి సీతరామయ్య, భోగరాజు
పన్నిద్ద రాళ్వారులు
పరిశోధన
పాల్కురికి సోమనాథుడు

గోదాదేవి
గోపాలాచార్యులు, దివి
గౌతమి
చిత్తూరు
జయస్వాల్ కె.పి.
డా. రఘువీర
డా. సునీత్‌కుమార్ చటర్జీ
తంజావూరు
తంత్రవార్తికం
తాడిమర్రు
తాతాచార్యులు
తిరుపతి
తెలుగుపత్రిక
దివ్యప్రబంధం
దేశాభిమాని
ధమ్మపదం
నన్నయ్య
నాగానందం
విజ్ఞానచంద్రికా గ్రంథమండలి
విజ్ఞాన సర్వస్వం
విన్‌స్టన్ చర్చిల్
వినయ పిటకం
వీరేశలింగం, కందుకూరి
వెంకటప్పయ్య, కొండ

ప్రతాపరెడ్డి, సురవరం
ప్రతిభ
ప్రభాకరశాస్త్రి, వేటూరి
ప్రియదర్శిక
బాలరాజు, రత్నాకరం
బళ్లారి
బాపిరాజు, అడవి
భగవద్రామానుజులు
భారతి
మల్లినాథుడు
మానియర్ విలియమ్స్
మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ
రవీంద్రనాథ ఠాగూర్
రాఘవభట్టు
రామకృష్ణకవి, మానవల్లి
రామచంద్రశాస్త్రి, మారేపల్లి
రామమూర్తి, కోడి
రాయవెల్లూరు జైలులో విప్లవకారులు
లక్ష్మీనరసింహం, చిలకమర్తి
విక్రమోర్వశీయం
విజయనగరం

వెంకటరమణయ్య, బులుసు
వెంకటరమణయ్య, నేలటూరి
వెంకటలక్ష్మణరావు, కొమర్రాజు
వెంకటశివుడు, రాయసం
వేంకటరామమూర్తి, గిడుగు
వైఖానస శ్రీనివాసాచార్యుడు
వ్యవహారిక భాషోద్యమం
శాకుంతలం
శ్రీ కృష్ణదేవరాయలు
శ్రీరంగం
శ్రీవిల్లిపుత్తూరు
శ్రీవైష్ణవం
శ్రోత్రియం
శ్రీశైలపూర్ణులు (తిరుమల నంబి)
శేషాచార్యులు, ముచ్చుకుంట
సత్యజ్ఞానతీర్థులు, పెజావర్ మఠం (ఉడిపి)
సాహితి (తెలుగుపత్రిక)
సుందరపాండ్యుడు
సుబ్రహ్మణ్యశాస్త్రి, పోతుకూచి (శ్రీ పి. ఎస్. శాస్త్రి)
సూర్యనారాయణ, యడవల్లి
సోమశేఖరశర్మ, మల్లంపల్లి

---

# తిరుమల రామచంద్ర
# జీవనరేఖలు

| | | |
|---|---|---|
| 1 | పేరు | తిరుమల రామచంద్ర |
| 2 | తండ్రిగారు | తిరుమల శేషాచార్యులు (కీ.శే). |
| 3 | తల్లిగారి పేరు | శ్రీమతి జానకమ్మ (కీ.శే). |
| 4 | జననదినం | 17 జూన్ 1913 – ప్రమాది జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి. |
| 5 | జననస్థలం | రాఘవంపల్లి, ధర్మవరం తాలూకా, అనంతపురం జిల్లా. |

**6 విద్యార్హతలు**

| | | |
|---|---|---|
| 1 | బి.ఏ. చదువు, లాహోర్, 1940 – పూర్తికాలేదు. | |
| 2 | సంస్కృత–తెలుగు విద్వాన్, మద్రాసు విశ్వవిద్యాలయం, | 1936 |
| 3 | హిందీ ప్రభాకర్, పంజాబ్ విశ్వవిద్యాలయం, | 1941 |
| 4 | ఆయుర్వేదభూషణ, అలీగఢ్ ఆయుర్వేద విద్యాపీఠం, | 1933 |
| 5 | సంస్కృత, ప్రాకృత, తెలుగు, కన్నడ, హిందీ, తమిళ, ఆంగ్లాల పరిచయం. | |

**7 స్వాతంత్ర్యసమరయోధుడు**

| | | |
|---|---|---|
| 1 | ఉప్పు సత్యాగ్రహంలోను, వైయక్తిక సత్యాగ్రహంలోను పాల్గొని 12 నెలల కఠినకారాగార శిక్ష, | 1930–32 |
| 2 | మద్రాసు కుట్ర కేసు నిందితుడు – | 1934 |
| 3 | కేంద్రప్రభుత్వం స్వతంత్ర సైనిక్ సమ్మాన్ పెన్షన్ – | 1974 నుండి |
| 4 | మద్రాసు ప్రభుత్వ స్వతంత్ర సైనిక్ సమ్మాన్ పెన్షన్ – | 1986 నుండి |
| 5 | ఆంధ్రప్రభుత్వం మెన్ ఆఫ్ లెటర్స్ పెన్షన్ – | 1987 నుండి |

## 8 ఉద్యోగాలు

| | | |
|---|---|---|
| 1 | రిపోర్టర్, డెయిలీ టెలిగ్రాఫ్, కాన్పూరు – | 1944 |
| 2 | సబ్-ఎడిటర్, తెలంగాణ పత్రిక, హైదరాబాద్ – | 1945 |
| 3 | సబ్-ఎడిటర్, మీజాన్ దినపత్రిక, హైదరాబాద్ – | 1945-47 |
| 4 | సబ్-ఎడిటర్, ఆంధ్రప్రభ, మద్రాసు – | 1947-58 |
| 5 | అసిస్టెంట్ ఎడిటర్, స్పెషల్ కరెస్పాండెంట్, ఆంధ్రపత్రిక – | 1959-71 |
| 6 | భారతి మాసపత్రిక ఇన్ ఛార్జ్ – | 1964-71 |
| 7 | కొన్ని నెలలు ఆంధ్రపత్రికకు ఎడిటర్ – | 1971 |
| 8 | పరిశోధన, స్థాపక సంపాదకుడు, మద్రాసు – | 1952-55 |
| 9 | ఆంధ్రభూమి, ఆదివారం నిర్వహకుడు, హైదరాబాద్ – | 1975-79 |
| 10 | న్యూస్ ఎడిటర్, హిందుస్థాన్ సమాచార్, హైదరాబాద్ – | 1980 |
| 11 | ఫీచర్ రైటర్, ఆంధ్రప్రభ, హైదరాబాద్ – | 1971-72 |
| 12 | ఫీచర్ రైటర్, ఆంధ్రపత్రిక, హైదరాబాద్ – | 1972-89 |
| 13 | ఫీచర్ రైటర్, ఆంధ్రప్రభ, హైదరాబాద్ – | 1989 చివరివరకు |

## 9 నిర్వహించిన శీర్షికలు

| | | |
|---|---|---|
| 1 | నుడి – నానుడి | ఆంధ్రప్రభసచిత్రవారపత్రిక |
| 2 | తెలుగుతల్లి | " |
| 3 | మరపు రాని మనీషి | " |
| 4 | పదసంపద | " |
| 5 | మాటల కథ | " |
| 6 | ధర్మపీఠమ్ | " |
| 7 | సంస్కృతి-సంప్రదాయం | " |
| 8 | హైదరాబాద్ లేఖ | " |
| 9 | హైదరాబాద్ నోట్ బుక్ | ఆంధ్రసచిత్రవారపత్రిక |
| 10 | తెలుగు వెలుగులు | " |
| 11 | సాహితీసుగతుని స్వగతం | భారతి |
| 12 | మనవిమాటలు | " |
| 13 | ఇదీ మన హైదరాబాద్ | ప్రజాతంత్ర |
| 14 | రాజధాని విశేషాలు | ఆంధ్ర ప్రదేశ్ |
| 15 | ప్రాచీనాంధ్రగాథలు | పల్లకి |
| 16 | చరిత్రకెక్కని చరితార్థులు | పరిశోధన |

17 తెలుగు తోబుట్టువులు "
18 మరో ప్రపంచం ఉదయం దినపత్రిక
19 మాండలికాలు ఆంధ్రప్రభ దినపత్రిక
20 పలుకుబడి ఆంధ్రప్రభ దినపత్రికలో
(ఇన్ని శీర్షికలు నిర్వహించినవారు లేరు)

## 10 ఇతర ఉద్యోగాలు

1 పండితుడు, ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ, మద్రాసు- 1935-38
2 పండితుడు, సరస్వతీ మహల్ లైబ్రరీ, తంజావూరు- 1938-39
3 సంస్కృతలిఖితపుస్తకాల క్యాటలాగర్, పంజాబ్ విశ్వవిద్యాయం, లాహోర్, 1939-41
4 హెపల్ దార్ క్లర్క్, భారతసైన్యం, క్వెట్టా, చమన్ - 1941-44
5 సంస్కృతలిఖితపుస్తకాల క్యాటలాగర్, బిర్లారిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, ఆస్మాన్ గఢ్ పేలెస్, హైదరాబాద్ - 1972-75
6 అనువాదకుడు, ఇస్కాన్, హైదరాబాద్ - 1985-91
7 సూపర్ వైజర్, లఘుశబ్దార్థసర్వస్వం, ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ, హైదరాబాద్ - 1992-95
8 సమ్మానప్రాధ్యాపకుడు, ప్రాకృతశాఖ, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ - 1995 నుంచి

## 11 ప్రచురణలు

సంస్కృతమ్ :-

1 సత్యాగ్రహవిజయః, నాటకం 1930
2 సుమతిశతకమ్ 1932

హిందీ :-

1 ఆంధ్ర కే కుఛ్ త్యోహార్ (కొంత ముద్రితం)

తెలుగు :-

1 రూట్ మార్చ్ (సైన్యం కథలు) 1945
2 వీరగాథలు 1952
3 దక్షిణాంధ్రవీరులు 1953
4 లాల్ బహదూర్ శాస్త్రి 1953

| | | |
|---|---|---|
| 5 | కాటమరాజు | 1955 |
| 6 | హిందువుల పండుగలు – పర్వాలు | 1957 |
| 7 | మన లిపి పుట్టుపూర్వోత్తరాలు | 1957 |
| 8 | ధర్మదీక్ష | 1958 |
| 9 | శశాంకవతి (బృహత్కథ ఆధారంగా నవల) | 1960 |
| 10 | తెలుగు వెలుగులు (ఆంధ్రపత్రిక) | 1962 |
| 11 | నుడి నానుడి | 1963 |
| 12 | సాహితీసుగతుని స్వగతం | 1970 |
| 13 | నూరేళ్ల తెలుగువ్యాసం | 1975 |
| 14 | మరపు రాని మనీషి (లేఖినీచిత్రాలు) | 1975 |
| 15 | నాగలాపురం – దాని పరిసరాలు (చరిత్ర పరిశోధనం) | 1975 |
| 16 | గాథాసప్తశతిలో తెలుగు పదాలు (వ్యాస సంపుటి) | 1980 |
| 17 | మూడు వాఙ్మయశిఖరాలు | 1988 |
| 18 | తెలుగు పత్రికల సాహిత్య సేవ | 1989 |
| 19 | ప్రాకృతవాఙ్మయంలో రామకథ | 1992 |
| 20 | మనవిమాటలు (వ్యాససంకలనం) | 1992 |
| 21 | బుద్ధుణ్ణి బళ్లో వేసినకథ (పిల్లలకు) | 1993 |
| 22 | బృహదారణ్యకం (వ్యాససంకలనం) | 1993 |
| 24 | హాలుని గాథలు – తెలుగు కథలు | ముద్రణలో |
| 25 | నాలుగు చరిత్ర స్తంభాలు | ముద్రణలో |
| 26 | హంపీ నుంచి హరప్పాదాక | |
| 27 | మనోరమా వాచకాలు – తెనాలి<br>వివేకానంద వాచకాలు – "<br>ఆనంద వాచకాలు – హైదరాబాద్ | 1954 – 1956 |
| 28 | వేయికి పైగా వ్యాసాలు, వందలలో పుస్తకసమీక్షలు | |

## 12 అనువాదాలు

సంస్కృత, ప్రాకృత్తాల నుంచి:

| | | |
|---|---|---|
| 1 | అవదానకల్పలత | 1960 |
| 2 | బృహత్కథామంజరి | 1964 |
| 3 | లలితవిస్తర మహాపురాణం (సం–ప్రా) | 1969 |
| 4 | హారమేఖల (ప్రా) | 1989 |

5 లీలావయీ కహో (ప్రా) – (ఆంధ్రప్రభ) 1994 - 1995

కన్నడం నుంచి :

6 శాంతల (నవల) – కె.వి. అయ్యర్–(సా.అ.ఢిల్లీ)

7 మరల సేద్యానికి (నవల) – శివరామకారంత్–(సా.అ.ఢిల్లీ)

8 మరణానంతరం (నవల) – శివరామకారంత్–(సా.అ.ఢిల్లీ)

9 గ్రామాయణం (నవల) – రావ్ బహాదుర్–(నేషనల్ బుక్ ట్రస్ట్ ఢిల్లీ)

10 కన్నడవ్యాస సంకలనం (సా.అ.ఢిల్లీ)

11 కొన్ని కన్నడ నాటకలు – (సౌతిండియన్ బుక్ ట్రస్ట్ మద్రాసు)

12 చిరస్మరణ (నవల) – విశాలాంధ్ర, హైదరాబాద్)

తమిళంనుంచి :-

13 కామరాజనాడార్ రష్యా పర్యటన – ఆంధ్రపత్రిక 1970

14 రాజాజీ కథలు 1970

హిందీ నుంచి :-

15 గాంధీజీ కారావాసకథ – సుశీలానయ్యర్–ఆంధ్రప్రభ 1965

ఆంగ్లం నుంచి :-

16 30కి పైగా ఆంగ్లపుస్తకాల అనువాదం,
పెక్కు కథల, వ్యాసాల అనువాదం (వివిధభాషల నుంచి)

## 13 సంపాదకత్వం, కూర్పు

1 శారీరం – బాలసరస్వతి వైద్యగ్రంథం 1961

2 అధికారభాష 1974

3 సాంస్కృతికవారోత్సవాలు 1974

4 అరాధన (పత్రిక) – సంపాదకవర్గం 1975 - 1978

5 సంజీవయ్య స్మారక సంచిక 1970

6 తెలుగువాణి
(ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచికలు) 1975, 1981

7 బాలల మహాసభ సంచిక 1977

8 త్రిభాషా నిఘంటువు (కూర్పు) 1978

9 విజ్ఞాన సర్వస్వం – లలితకళాసంపుటి (సంకలనం) 1979

10 బాలచంద్రిక – సంపాదకత్వం 1979 - 1980

11 జర్నలిజం ఇన్ ఆంధ్రప్రదేశ్ (సంపాదకత్వం) 1980

12 లలితకళాపదకోశం – తెలుగు విశ్వవిద్యాలయం (కూర్పు) 1980

13 బుద్ధుడు (సంపాదకత్వం), హైదరాబాద్ 1990
14 అనుభవవైద్యం (సంపాదకత్వం)
ప్రాచ్యలిఖిత పుస్తకాలయం, హైదరాబాద్ 1991
15 భార్గవపురాణం (సంపాదకత్వం) " 1992
16 బుద్ధుడు - జీవితం, అవగాహన
(సంపాదకత్వం), విజయవాడ 1992
17 కోరాడ రామకృష్ణయ్య శతజయంతి సంచిక-హైదరాబాద్ 1992
18 ఇ.ఎఫ్.ఎల్.ఐ విద్యావిషయక చలనచిత్రాలు,
(సహసంపాదకత) 1988 - 1992

## 14 పరిశోధనపత్రాల సమర్పణ

1 ఇంటర్నేషనల్ ఓరియంటల్ కాన్ఫరెన్స్ 1965
2 అలిండియా ఓరియంటల్ కాన్ఫ రెన్స్ - కురుక్షేత్ర 1971
3 " " " - ఉజ్జయిని 1972
4 ప్రపంచసంస్కృతజ్ఞ మహాసభ, ఢిల్లీ 1972
5 లింగ్విస్టిక్ కాన్ఫరెన్స్, హైదరాబాద్ 1974
6 రామాయణసదస్సు, వైట్ ఫీల్డ్ 1975
7 అలిండియా ఓరియంటల్ కాన్ఫ రెన్స్ - ధార్వాఢ 1976
8 " " " - పుణె 1978
9 " " " - శాంతినికేతన్ 1980
10 ప్రాకృతంపై ఎక్సెన్షన్ లెక్చర్, కాకతీయ
విశ్వవిద్యాలయం, వరంగల్ 1980
11 డాక్టర్ రావిప్రోలు సుబ్రహ్మణ్యం గారి స్మారక
సంచిక, హైదరాబాద్ 1983
12 ప్రాకృత - తెలుగు సంబంధాలు, కృష్ణదేవరాయ
విశ్వవిద్యాలయం, అనంతపూర్ 1984
13 విశ్వవిద్యాలయాల వెలుపలి పరిశోధకులు, కాకతీయ
విశ్వవిద్యాలయం, వరంగల్ 1985
14 ఆంధ్ర ఓరియంటల్ కాన్ఫరెన్స్, హైదరాబాద్ 1987
15 విద్యారణ్యసదస్సు, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్ 1988
16 ప్రాకృతంలో సామాన్యమానవుడు మద్రాసు
విశ్వవిద్యాలయం, తెలుగు యూనియన్, మద్రాసు 1988

17 పాలీ – తెలుగు, తెలుగు మహాసభ, బెంగళూరు 1990
18 ప్రాకృతం, నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు 1991
19 సుప్రసన్నాచార్య సన్మాన సంచిక, వరంగల్ 1992
20 పైశాచీప్రాకృతం – తెలుగు, హైదరాబాద్
యూనివర్సిటీ, హైదరాబాద్ 1993
21 అనంతకృష్ణుల గాథాసప్తశతి అనువాదపద్ధతి,
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ 1993
22 జైనమతం సదస్సు, హైదరాబాద్ 1994
23 భారతి సూచి, హైదరాబాద్ 1996
24 నాడీగ్రంథాలు, జ్యోతిషమహాసభ, హైదరాబాద్ 1996
ఇంకాఎన్నో

## 15 సభ్యత్వాలు

1 తిరుపతి పట్టణ కాంగ్రెస్ సంఘ కార్యదర్శి, తిరుపతి 1926–32
2 ఓరియంటల్ లైబ్రరీ సలహాసంఘ సభ్యుడు, మద్రాసు 1949–53
3 భాషాసేవక సమితి, స్థాపకుడు, మద్రాసు 1950–58
4 పరిశోధన సలహా సంఘం, రాష్ట్ర సాహిత్య అకాడెమీ 1960–85
5 తెలుగులిపి సంస్కరణ సంఘం, ఆంధ్రప్రభుత్వం హైదరాబాద్ 1960
6 స్థాపకాధ్యక్షుడు, ప్రాకృత అకాడెమీ, హైదరాబాద్ 1969
7 తెలుగు–కన్నడలిపి ఏకీకరణ సంఘం కన్వీనర్, హైదరాబాద్ 1970
8 తెలుగు వర్క్ షాప్ (నేషనల్ బుక్ ట్రస్టు)–హైదరాబాద్ 1971
9 స్టేట్ లైబ్రరీ కమిటీ, హైదరాబాద్ 1973–75
10 బాలల అకాడెమీ, కార్యదర్శి, హైదరాబాద్ 1979–80
11 రాష్ట్ర సాహిత్య అకాడెమీ, సభ్యుడు, హైదరాబాద్ 1979–80
12 సమీక్షకుడు, ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు,
కౌలాలంపూర్, మలేషియా 1981
13 ఆకాశవాణి సలహాసంఘం, హైదరాబాద్ 1980–82
14 సలహా సంఘం, తెలుగు శబ్ద సాగరం, తెలుగు అకాడెమీ,
హైదరాబాద్ 1986–91
15 తెలుగు–కన్నడ ఉమ్మడిలిపి సంఘం, బెంగుళూర్ 1990–91
16 గాంధీ సాహిత్యప్రచురణలు, సంపాదకమండలి,
హైదరాబాద్ 1992నుంచి

17 బుక్ సెలెక్షన్ కమిటీ, గ్రంథాలయ సంస్థ, హైదరాబాద్ 1992-95
18 జగన్నాథ రాజామణి విళా, రాజపాళయం, తమిళనాడు 1994
19 అనువాదకుల సంఘం, " 1994
20 జ్ఞానపీఠ బహుమతి పుస్తకపరిశీలన సంఘం సభ్యుడు, రెండు సార్లు ఢిల్లీ
21 మద్రాసు పత్రికారచయితల సంఘం (ఎమ్.యు.జె), మద్రాసు
22 ఆంధ్రరాష్ట్ర పత్రికారచయితల సంఘం, ఎ.పి.డబ్ల్యు.జె.యు.
23 హైదరాబాద్ పత్రికారచయితల సంఘం,
24 పుస్తక ప్రచురణ సంఘం, అధ్యక్ష్యుడు, టి.టి.డి, తిరుపతి
1996 డిసెంబరు నుంచి

## 16 బిరుదులు, సన్మానాలు

1 వర్ధమానసమాజం, నెల్లూరు 1960
2 ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం, హైదరాబాద్ 1969
3 రాష్ట్ర సాహిత్య అకాదెమీ అవార్డు, హైదరాబాద్ 1970
(సాహితీసుగతుని స్వగతం వ్యాససంపుటికి)
4 రామాయణ సదస్సు, వైట్ ఫీల్డ్ 1975
5 ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభ, హైదరాబాద్ 1975
6 "పత్రకారశిరోమణి" బిరుదు, పశ్చిమవంగ నాగరీ ప్రచారిణీ
సభ కలకత్తా 1970
7 విశాలాంధ్ర ప్రచురణాలయం రజతోత్సవం, హైదరాబాద్ 1977
8 మాడపాటి మానుమంతరావు శతజయంతి అవార్డు 1977
9 "మహామహోపాధ్యాయ" బిరుదం, అఖిలభారత
విద్వత్పరిషత్తు, వారాణసి 1978
10 అనంతపురంజిల్లా రచయితల సంఘం, అనంతపురం 1978
11 రావిప్రోలు సుబ్రహ్మణ్యం పరిశోధన సంస్థ, హైదరాబాద్ 1980
12 యూనిటీ అవార్డు, హైదరాబాద్ 1980
13 రాష్ట్ర సాహిత్య అకాదెమీ అవార్డు, హైదరాబాద్
(గాథాసప్త శతిలో తెలుగు పదాలు, వ్యాస సంపుటికి) 1980
14 ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభ, కౌలాలంపూర్,
మలేషియా 1981
15 షోలాపూర్ అంధ్రసంఘం, షోలాపూర్, మహారాష్ట్ర 1982
16 "కళాసరస్వతి" బిరుదు, హైదరాబాద్ 1984

| | | |
|---|---|---|
| 17 | విజ్ఞానదీపిక అవార్డు, హైదరాబాద్ | 1985 |
| 18 | వి.పి.డబ్ల్యు.జెయు, హైదరాబాద్ | 1985 |
| 19 | రసమయి, హైదరాబాద్ | 1985 |
| 20 | తెలుగు విశ్వవిద్యాలయం, ధర్మనిధి పురస్కారం,హైదరాబాద్ | 1986 |
| 21 | శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, హైదరాబాద్ | 1986 |
| 22 | భారత కళాపరిషత్తు, హైదరాబాద్ | 1987 |
| 23 | ఆంధ్ర ఓరియంటలిస్ట్స్ కాన్ఫరెన్సు, హైదరాబాద్ | 1987 |
| 24 | తెలుగు యూనివర్శిటీ ధర్మనిధి బహుమతి, హైదరాబాద్ | 1987 |
| 25 | తెలుగు అకాడెమీ, హైదరాబాద్ | 1988 |
| 26 | ఆంధ్రప్రభ, మద్రాసు | 1988 |
| 27 | గౌరవ డాక్టరేట్ బిరుదు, సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్ | 1988 |
| 28 | హైదరాబాద్ జర్నలిస్ట్ యూనియన్ | 1988 |
| 29 | రాజా లక్ష్మి అవార్డు, మద్రాసు | 1989 |
| 30 | మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు యూనియన్, మద్రాసు | 1989 |
| 31 | శ్రీనివాస వెల్ఫేర్ అసోసియేషన్, హైదరాబాద్ | 1990 |
| 32 | ఎ.పి.ఎ.బి.సి.డి, హైదరాబాద్ | 1990 |
| 33 | పులుపుల శివయ్య స్మారక బహుమతి, గుంటూరు | 1991 |
| 34 | ఆంధ్ర సంఘం, బరంపురం | 1991 |
| 35 | కిన్నెర – నిడుదవోలు అవార్డ్, హైదరాబాద్ | 1991 |
| 36 | లలితకళాపరిషత్తు, అనంతపూర్ | 1991 |
| 37 | అడవి బాపిరాజు కళాపరిషత్తు, గుంటూరు | 1992 |
| 38 | అమరేంద్ర అవార్డు, గుంటూరు | 1992 |
| 39 | ఆంధ్ర ప్రభుత్వం ఉగాది సన్మానం, హైదరాబాద్ | 1992 |
| 40 | వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజి, పాలెం | 1992 |
| 41 | క్విట్ ఇండియా స్వర్ణోత్సవం, తమిళనాడు ప్రభుత్వసన్మానం, మద్రాసు | 1993 |
| 42 | రాష్ట్ర ప్రభుత్వం ఉగాది సన్మానం, ముఖ్యమంత్రి శ్రీవిజయభాస్కర రెడ్డిగారు | 1993 |
| 43 | తెలుగు ఉగాది సన్మానం, రాజపాళయం, తమిళనాడు | 1994 |
| 44 | శ్రీ వేంకటేశ్వర ఫైన్ ఆర్ట్స్ కాలేజి, హైదరాబాద్ | 1994 |
| 45 | సోమనాథ కళాపీఠం, పాలకుర్తి | 1994 |

| | | |
|---|---|---|
| 46 | దాశరథి రంగాచార్య అవార్డ్, హైదరాబాద్ | 1994 |
| 47 | విశిష్ట పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం | 1994 |
| 48 | యంగ్ మెన్ అసోసియేషన్, హైదరాబాద్ | 1994 |
| 49 | శ్రీనివాస వెల్ఫేర్ అసోసియేషన్, హైదరాబాద్ | 1994 |
| 50 | సాలార్ జంగ్ మ్యూజియం స్థాపనదినోత్సవం, హైదరాబాద్ | 1995 |
| 51 | సహృదయ సాహితి, విశాఖపట్టణం | 1995 |
| 52 | రాష్ట్ర ప్రభుత్వ ఉగాది సన్మానం, ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుగారు | 1995 |
| 53 | విశాఖసాహితి, విశాఖపట్టణం | 1995 |
| 54 | జ్యోతిషసదస్సు, రవీంద్ర భారతి, హైదరాబాద్ | 1996 |
| 55 | బూర్గుల రామకృష్ణరావు స్మారక అవార్డు, హైదరాబాద్ | 1996 |
| 56 | సిద్ధార్థ అకాడెమీ "వాఙ్మయవాణీవల్లభ" అవార్డు, విజయవాడ | 1996 |
| 57 | విశ్వయోగి విశ్వంజీ, గూంటూరు | 1996 |
| 58 | విశ్వయోగి విశ్వంజీ అన్నగారు విద్యాసాగరరావు గారి సన్మానం | 1996 |
| 59 | ప్రకాశం 125వ జయంతి, ఒంగోలు | 1996 |
| 60 | సి.వి.ఎన్. ఆస్ట్రో సర్వీసెస్, హైదరాబాద్ | 1996 |
| 61 | మాడుగుల సహస్రావధానంలో సన్మానం, హైదరాబాద్ | 1996 |
| 62 | పుల్లాభొట్ల వెంకటేశ్వర్లుగారి కవిసమ్మేళనం, ఖమ్మం | 1996 |
| 63 | స్వామీ జ్ఞానానంద జయంతి, గొరగనమూడి, పశ్చిమగోదావరి జిల్లా | 1996 |
| 64 | కనుపర్తి పరలక్ష్మమ్మ శతజయంతి, హైదరాబాద్ | 1996 |
| 65 | ముదిగొండ వీరేశలింగం వర్ధంతి, హైదరాబాద్ | 1996 |
| 66 | ప్రాచ్య విద్యా పరిషత్తు, కామారెడ్డి | 1997 |
| 67 | తిమ్మావజ్ఝల కోదండరామయ్య సాహిత్య పురస్కారం, తిరుపతి | 1997 |
| 68 | కవిరాజ పురస్కారం, గుడివాడ | 1997 |
| 69 | "వార్త" వార్షికోత్సవ పురస్కారం, హైదరాబాద్ | 1997 |

## 17 కలం పేర్లు

| | |
|---|---|
| 1 | చంద్ర |
| 2 | రా.చ. |
| 3 | తి.రా. |
| 4 | రా.తి. |
| 5 | తిరుమల |
| 6 | తాతాచార్య |
| 7 | ఆచార్య |
| 8 | సంచారి |
| 9 | బాటసారి |
| 10 | పర్యాటక్ |
| 11 | పరిశీలక్ |
| 12 | పరిశోధక్ |
| 13 | ప్రయాణికుడు |

ఇన్ని కలం పేర్లు దేశంలోనే ఎవరికీ లేవు.

20వ శతాబ్ది తెలుగుసాహిత్య జగతిలో **తిరుమల రామచంద్ర**ది (1913-97) విశిష్టవ్యక్తిత్వం. సంస్కృతాంధ్ర ప్రాకృతసాహిత్యాలలో వారిది చెప్పుకోదగిన పాండిత్యం. పాత్రికేయుడిగా తిరుమల రామచంద్ర తెలుగు సాహిత్య, సాంస్కృతిక విషయక, పురా చరిత్రలకు చేసిన సేవ నిరుపమానం. ఇంచుమించు ఎనిమిదిన్నర పదులుసాగిన ఆయన జీవయాత్రలో ఆరుపదుల కాలం పత్రికావృత్తికి ఆయన రాణింపుతెచ్చారు. తెలుగునాట ప్రాచుర్యంగల పత్రికలన్నిటిలోనూ ఆయన పనిచేశారు. అందరిమెప్పూ సంపాదించుకున్నారు. ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అత్యంత ప్రభావితం చేసిన సాహిత్య పత్రిక భారతికి వారు కొన్నాళ్ళు సంపాదక బాధ్యత నిర్వహించారు. ఈ కాలాన తెలుగు వారైన కవిపండిత పరిశోధక సాహిత్యవేత్తలలో, లలితకళావిదులలో రామచంద్ర అంత దేశాటనం చేసినవారు మరొకరులేరు. ఆయనవలె జీవికావృత్తిని నిర్వహించిన వారూ మరిలేరు. వివిధ తెలుగు పత్రికలలో వివిధ విషయాలపై వారు వెయ్యికి మించిన వ్యాసాలు రాశారు. హైదరాబాదు నగరంలోని తెలుగు విశ్వవిద్యాలయంలో వారు కొంత కాలం ప్రాకృత భాషాధ్యయన తరగతులు నిర్వహించారు కూడాను.

ఆయన ప్రాచ్యపండితుడేకాక ఆధునిక విమర్శకుడు కూడా. ప్రచురణమైన గ్రంథాలు వారివి సుమారు 50 వరకూ ఉన్నాయి. ఆయన సర్వరచనలూ ప్రచురిస్తే అవి ఇంకొక 50 సంపుటాలుగా రూపొందుతాయి. ఇటీవల వెలువడిన వారిస్వీయచరిత్ర 'హంపీ నుంచి హరప్పాదాక' వారి బహుముఖ ప్రతిభకు, మానవీయ పరిపూర్ణతకు మనోజ్ఞమైన అక్షరసాక్ష్యం.

ఈ మోనోగ్రాఫ్ రచించిన **డా. అక్కిరాజు రమాపతిరావు**కు తిరుమల రామచంద్ర గారితో పాతిక సంవత్సరాలపైగా చాలా సన్నిహితమైన పరిచయం ఉండేది. స్వాతంత్ర్యానంతరపు తెలుగు రచయితల తరంలో శ్రీ రమాపతిరావు కథా, నవలా, రచయితగా, జీవితచరిత్ర కారుడిగా, పరిశోధకుడిగా, పరిచితులు. నవయుగ వైతాళికుడైన కందుకూరి వీరేశలింగం పంతులు సాహిత్య, సామాజిక కృషిపై పరిశోధనకుగాను వీరు పిహెచ్.డి. తీసుకున్నారు. వీరేశలింగం పంతులు – సమగ్రపరిశీలనగా ఈ గ్రంథం 1972లోనే వెలువడింది. ఇటీవల డా. రమాపతి రావు తన జీవితానుభవాలు ప్రకటించారు. ఇంత వరకు తనవీ ఇతరులవీ కలిపి నూరుపైగా గ్రంథాలు ప్రచురించారు.

ISBN 81-260-2327-9

Tirumala Ramachandra (Telugu) Rs. 25/-

9788126023271

తిరుమల రామచంద్ర ■ అక్కిరాజు రమాపతిరావు